# నాగానందము

(ఆంధ్రానువాదము)




అనువాదకుడు

**ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు**





ప్రచురణ :

**సంస్కృత భాషా ప్రచార సమితి**

(జి. పుల్లారెడ్డి చారిటీస్ ట్రస్ట్ అనుబంధ సంస్థ)

హైదరాబాదు - 500 001.

1995

# నాగానందము

ఆంధ్రానువాదము

**డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు**

ప్రథమ ముద్రణ : 1995, జూన్

ప్రతులు : 1000

వెల : రు. 18/-

ప్రాప్తి స్థానము :
కార్యదర్శి,
**సంస్కృతభాషా ప్రచార సమితి,**
5-4-743/C, 2 వ అంతస్తు,
హరేకృష్ణ దేవాలయం ప్రక్కన,
నాంపల్లి స్టేషన్‌రోడ్డు, హైదరాబాదు - 1.
ఫోన్ : 4615481.

ముద్రణ :
**పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్,**
1-1-517/బి/1,
న్యూ బాకారం, గాంధీనగర్,
హైదరాబాదు - 500 380.
ఫోన్ : 7611413.

# నాగానందము

ఆంధ్రానువాదము

**డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు**

ప్రథమ ముద్రణ : 1995, జూన్

ప్రతులు : 1000

వెల : రు. 18/-

ప్రాప్తి స్థానము :
కార్యదర్శి,
**సంస్కృతభాషా ప్రచార సమితి,**
5-4-743/C, 2 వ అంతస్తు,
హరేకృష్ణ దేవాలయం ప్రక్కన,
నాంపల్లి స్టేషన్‌రోడ్డు, హైదరాబాదు - 1.
ఫోన్ : 4615481.

ముద్రణ :
**పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్,**
1-1-517/బి/1,
న్యూ బాకారం, గాంధీనగర్,
హైదరాబాదు - 500 380.
ఫోన్ : 7611413.

# నాటకంలోని పాత్రలు

## పురుషులు

1. జీమూతకేతువు : విద్యాధరరాజు.
2. జీమూతవాహనుడు : నాయకుడు. జీమూతకేతుని పుత్రుడు.
3. మిత్రావసువు : సిద్ధరాజైన విశ్వావసుని పుత్రుడు.
4. శాండిల్యుడు : (తాపసుడు) సిద్ధరాజు పురోహితుడు. కౌశికుని శిష్యుడు.
5. గరుత్మంతుడు : పక్షిరాజు. నాగశత్రువు.
6. శంఖచూడుడు : గరుత్మంతునికి ఆహారంగా వాసుకి పంపినవాడు.
7. ఆత్రేయుడు : (విదూషకుడు) నాయకుని ప్రియమిత్రుడు.
8. శేఖరకుడు : (విటుడు) సిద్ధరాజు పరిజనంలోనివాడు.
9. చేటుడు : విటుని సేవకుడు.
10. కింకరుడు : నాగరాజు భటుడు.
11. వసుభద్రుడు : మిత్రావసుని కంచుకి.
12. సునందుడు : మిత్రావసుని ప్రతీహారి.

## స్త్రీలు

1. గౌరి : పార్వతీదేవి.
2. కనకవతి : (వృద్ధ) జీమూతకేతుని భార్య.
3. మలయవతి : నాయిక. విశ్వావసుని పుత్రి.
4. చతురిక
5. మనోహరిక
6. నవమాలిక

} మలయవతి చేటిలు.

7. వృద్ధ : శంఖచూడుని తల్లి.

కథ జరిగిన ప్రదేశం - మలయాచల ప్రాంతం.

శ్రీః

# మున్నుడి

హర్షవర్ధనుడు రచించిన 'రత్నావళి', 'ప్రియదర్శిక', 'నాగానందం' అనే మూడు రూపకాలలో నాగానందం విశిష్టమైనది. ఏడవ శతాబ్దంలో ఉత్తరభారత దేశాన్నంతనీ ఏకచ్ఛత్రాధిపతిగా ఏలిన హర్షవర్ధనుడు అనాడు ప్రచారంలో ఉన్న బౌద్ధ వైదికమతాలను రెండింటినీ ఒక చక్రవర్తిగా సమానమైన శ్రద్ధా భావంతో చూచేవాడనీ, వైయక్తికంగా ఆతనికి బౌద్ధమతం వైపు మొగ్గు ఉండే దనీ ఐతిహాసికులు చెపుతారు. ఈ తథ్యం మనకు నాగానందంలో స్పష్టంగా కనబడుతుంది. కథావస్తువు విద్యాధరజాతకం నుంచి గ్రహించబడింది. అందు చేత దీని బౌద్ధమత సంబంధం సుస్పష్టమే. కథానాయిక పార్వతీ భక్తురాలై తదనుగ్రహ పాత్రురాలవడం మొదలైన విషయాలు వైదికమతానికి సంబం ధించినవి. వీటిని కలిపి వ్రాసిన ఈ నాటకం అనాదికాలంనుంచీ భారతదేశంలో ఉన్న వివిధ మత సామరస్యాన్ని చాటుతున్నది. ఇది ఒక వైశిష్ట్యం.

అలంకారశాస్త్రదృష్ట్యా చూస్తే - కొందరు ఆలంకారికులు రసాలు ఎనిమిదే అనీ, శాంతరసం రసం కాదనీ అంటారు. మరికొందరు "శాంతం కూడా రసమే, కాని అది శ్రవ్యకావ్యాలలో మాత్రమే ఉంటుంది; అభినయ ప్రధానాలైన దృశ్యకావ్యాలలో శాంతోపనిబంధనం శక్యం కాదు" అంటారు. "రూపకాలలో కూడా శాంతరసానుప్రవేశానికి అభ్యంతరం ఉండదు. ఇందుకు ఉదాహరణం నాగానందమే. దీనిలోని పూర్వభాగం కొంతవరకు శృంగారప్రధాన మైనా, ఉత్తరభాగం శాంతప్రధానం కదా?" అని మరికొందరు అంటారు. నాగా నందానికి ఉన్న వైశిష్ట్యం ఇదొకటి. ఉత్తమమైన ప్రయోగార్హరూపకంగా దీని వైశిష్ట్యం ఉండనే ఉంది.

నేను మద్రాసు విశ్వవిద్యాలయంవారి (తెలుగు) "విద్వాన్" పరీక్షలో ఉత్తీర్ణుడనైన కొత్త రోజులలో తెలుగులో ఏమైనా వ్రాయాలని ఉత్సాహం ఉండేది. తత్ఫలితంగా నాగానందాన్ని ఆంధ్రీకరించాను. ఎప్పుడు ప్రారంభించానో గుర్తు లేదు కాని, దీని పూర్తిమాత్రం 4.4.1958 నాడు అయింది. వెంటనే ప్రచురించడం కుదరలేదు. 1960 లో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఉపాధ్యాయుడుగా చేరడం జరిగింది. అప్పటినుంచీ దృష్టి పి.హెచ్.డి. మొదలైన వాటిమీద ఉండడంచేత దీని ప్రచురణ విషయంలో శ్రద్ధ చూపలేదు. దాదాపు నలభై సంవత్సరాల క్రితం వ్రాసిన ఈ నాటకాన్ని ఎట్టి మార్పులూ చేయకుండగా యథాతథంగా ఇప్పుడు సంస్కృతభాషా ప్రచారసమితి ద్వారా ప్రచురిస్తున్నాం. ఈ అవకాశం కల్పించిన సంస్కృతభాషా ప్రచార సమిత్యధ్యక్షులు శ్రీ జి. పుల్లారెడ్డిగారికి కృతజ్ఞత తెలుపుతున్నాను.

పరిపాలనాదక్షులూ, సౌజన్యమూర్తి అయిన శ్రీ పి. యల్. శివరామ్ (I.A.S. Retd) గారు నాకు చిరపరిచితులు. వీరికున్న సంస్కృతభాషాభిమానం అనన్యాదృశమైనది. పుట్టింది మొదలు ఈ భాషతో సంబంధం ఉన్న నావంటివాళ్ళకి కూడా ఇంత అభిమానం లేదేమో అనిపిస్తుంది. ఒక ఉన్నతాధికారిగా పదవీ బాధ్యతలు నిర్వహిస్తూ కూడా వీరు సంస్కృత సాహిత్యంలో యమ్.ఏ. పట్టం డిస్టింక్షన్‌తో సాధించారు. వారు ఈ కృతిని అక్షరోపాయనంగా స్వీకరించడానికి అంగీకరించినందుకు వారికి కృతజ్ఞుడను.

ఈ నాటకంలో ఉపయోగించిన గ్రాంథికభాష నేటి వ్యావహారిక భాషామాత్ర పరిచయం ఉన్నవారికి కొంత ఎబ్బెట్టుగా కనబడవచ్చు. అయినా దీనిని అర్థం చేసికొని ఆనందించేవారు కూడా తప్పక ఉంటారని నా విశ్వాసం. కేవలం సంఖ్యామాత్ర భేదం. "కాలోహ్యయం నిరవధిర్విపులా చ పృథ్వీ."

హైదరాబాదు
**12.6.1995**

పుల్లెల శ్రీరామచంద్రుడు
కులపతి
సంస్కృతభాషా ప్రచారసమితి.

శ్రీరస్తు

# నాగానందము

## అనువాదకుని దైవ ప్రార్థన

శ్రీమీరన్ సకలాంధ్రదేశవిదితశ్రీకోనసీమాఖ్యస
ద్ధామప్రాంతవిశేషపుణ్యకలనన్ దానైనవిల్లాహ్వాయ
గ్రామంబందున నిల్చి భక్తవరులన్ గాపాడుచున్ బొల్చు నా
సామోద్భూతముఖున్ గణేశుఁ గొలుతున్ సర్వార్థసంధాయకున్.

క. కంపితవిపదోఘాచలు
సంపత్సంపాది భక్తసంరక్షకు నా
సంపూర్ణచంద్రవదను ని
లింపస్తుతు రాముఁ గొల్తు లీలాధామున్.

## నాంది

శా. ధ్యానవ్యాజమునన్ దలంచె దెదలోఁ దన్వంగి నెవ్వర్తుకన్
గానంజాలవె కామబాణహతలన్ గన్నెత్తి యీ దాసులన్
దీనత్రాతవు కావె నీదు కరుణోదీర్ణత్వ మింతే నటే
పోనిమ్మంచు స్మరాంగనాభిహితుఁడౌ బుద్ధుండు రక్షించుతన్.

మారుఁడు చాపమెక్కిడుచు మానుగ వాద్యము మ్రోచుచున్ భటుల్
స్మేరకటాక్షవిభ్రమ మసీమము గాగ నిలింపభామినుల్
గౌరవభావజాత పులకంబుల నింద్రుడు సిద్ధులున్ గడున్
గారవ మొప్పఁ జూడ నవికారుఁడు యోగివరుండు కావుతన్.

## నాంద్యంతమున

సూత్రధారుఁడు: (ప్రవేశించి) ఇంతటితోఁ జాలింపుడు. రాజాధిరాజ శ్రీ హర్ష దేవ పాదపద్మచ్ఛాయాసమాశ్రితు లగు సామంతు లెల్లరును జతుర్ది గంతములనుండియు నింద్రోత్సవార్థ మరుదెంచి యున్నారు కదా! వారు నన్ను సగౌరవముగఁ బిలచి "మా సార్వభౌముఁ డగు శ్రీ హర్ష దేవుఁడు విద్యాధర జాతకము నుండి కథావస్తువుఁ గైకొని యపూర్వ రచనానైపుణీ సంశోభిత మగు నాగానంద మను నాటకమును రచించియుండె నని కర్ణాకర్ణికగా వింటిమి. కాని దానిఁ బ్రయోగమునుఁ జూచియుండలేదు. కావున సకలజన మానసానంద సంధాయకుఁడగు నా సార్వభౌమునియందలి గౌరవముఁ బురస్కరించుకొనియు నస్మదనుగ్రహార్థంబును నా నాటకము నభినయింప వేడుచున్నాము" అని కోరి యున్నారు. వేషధారణాదుల నేర్పఱిచి వారి యభీష్టమును దీర్చెదను. (ముందుకు నడచి చూచుచు) సామాజిక హృదయముల నావర్జించితి ననియే నా విశ్వాసము. ఏలయన___

కవియా హర్షవిభుండు, పారిషదులా కావ్యజ్ఞులౌ పండితుల్
భువనవ్యాప్తయశోవిభూతి బళిరా! పుణ్యాత్ముఁడౌ నాయకుం
డవనిన్ ఖ్యాతుల మేము నాట్యకలయం దౌరా! సుదుష్ప్రాపమీ
భువి నొక్కొక్క గుణంబె యన్నియును నా పుణ్యాన నేఁ డొప్పెడున్.

ఇంటికిఁ బోయి ప్రేయసినిఁ బిలచి నాటకాభినయమున కేర్పాట్లు కావిం తును. (నడచి తెరవంకఁ జూచుచు) ఇదే నా గృహము; లోనికిఁ బ్రవేశింతును. (ప్రవేశించి) ఆర్యురాలా! ఇటు రమ్ము.

నటి : (ఏడ్చుచు) ఆర్యా! మందభాగ్యను నేనిదే వచ్చితిని; ఏమి చేయవలయును? ఆజ్ఞాపింపుడు.

సూత్ర : (చూచి) ఆర్యురాలా! ఏమిది? నాగానందము నభినయింపవలసియుండ నేల నీ వి ట్లకారణముగ నేడ్చుచున్నావు?

నటి : ఆర్యా! ఏమి చెప్పుదును? పూజ్యులగు మామగారు వార్ధకమున వైరాగ్య మంది కుటుంబభారమును నిర్వహింప నీవు సమర్థుఁడవె కదా యని యెంచి యత్తగారితోఁ గూడఁ దపోవనమునకుఁ బోయినారు.

సూత్ర : (దుఃఖముతో) ఏమీ! నన్ను విడచి తపోవనమునకుఁ బోయిరా నా తలి దండ్రులు? ఇపుడేమి చేయుదును? (ఆలోచించి) పితృచరణ శుశ్రూషా సుఖంబు విడచి నేను మాత్ర మీ యింట నెట్టు లుండగలను?

తే.గీ. తల్లిదండ్రుల శుశ్రూషఁ దనుపఁ బూని
యానువంశిక సంపద లవల బుచ్చి
యరిగెదను గాక నేనిదే యడవులకును
జెలియ! జీమూతవాహను వలెనె నేడు.

(నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన

## ప్రథమాంకము

(జీమూతవాహనుఁడు విదూషకుఁడునుఁ బ్రవేశింతురు.)

జీ.వా : (నిర్వేదముతో) మిత్రమా, ఆత్రేయా!

సీ॥ నానావిధంబుల నరుల మనంబులఁ
జెరచి మోహంబులఁ జేర్చు మదిర
ఇంద్రియహయముల నిటు నటుఁ ద్రిప్పుచు
నాటలాడించెడు మేటి రౌతు
అది చెడు గిది మంచి యను వివేకముఁ బాపి
మనుజుల మఱపించు మాయదారి
ఉరుతరంబగు దేవగురుభక్తి యను వారి
పూరంబు నెండించు ఘోరతపము

తే.గీ. యౌవనం బిది సర్వదోషాస్పదంబు
నస్థిరం బౌర! జలబుద్బుదాభ మైన
నిదియ సంతోష మిచ్చు నా మదికి నెపుడుఁ
దల్లిదండ్రుల శుశ్రూషఁ దనుపుదేని.

విదూ : (కోపముతో) వయస్యా! ఎంత కాల మీ జీవన్మృతుల సేవకై వనవాస దుఃఖ మనుభవింతువు? లెమ్ము; ఇప్పుడైన నీ పితృసేవాబంధనములఁ దెగఁద్రెంచి నానాభోగమనోజ్ఞమగు రాజ్యసుఖ మనుభవింపుము.

జీ.వా : మిత్రమా! పొరబడుచున్నావు. చూడుము.

సీ॥ తండ్రి పాదము చెంతఁ దగ నిల్వ నగు శోభ
కనకసింహాసనంబునను గలదె
తండ్రిపాదము లొత్తు తరి నివ్వటిల్లెడు
సుఖమున కీరాజ్యసుఖము లీడె
జనకపాదోచ్ఛిష్టమునఁ గల్గు సంతృప్తి
ముజ్జగం బేలిన సజ్జ మగునె
జనకాజ్ఞఁ బాలింపఁ జనియించు నానంద
మొరుల నాజ్ఞాపింప నొందఁ దగునె

తే.గీ. తల్లిదండ్రులు దేవతాత్మకులు గారె
వారి సేవయె సంపదావహము గాదె
దాని విడనాడ ఘోరపాతకము రాదె
యేల యిట్టులఁ బల్కెదో బేల వోలె?

విదూ : (తనలో) అహా! ఏమి యీతని గురుశుశ్రూషానురాగము! (ఆలోచించి) కానిమ్ము ఇటు లనెదను. (ప్రకాశముగా) వయస్యా! నేను కేవలము రాజ్యసుఖము నుద్దేశించియే చెప్పటలేదు. నీకింకనుఁ గర్తవ్యము లున్నవి కదా!

జీ.వా : (చిరునవ్వుతో) మిత్రమా, కర్తవ్యము లన్నిఁటిని సాధించితిని గదా! చూడుము—

మ. ప్రజలన్ ధర్మపథంబునం దునిచితిన్, రక్షించితిన్ శిష్టులన్
నిజరాజ్యంబు దృఢీకరించితి నిలన్ నెక్కొల్పితిన్ బాంధవ
వ్రజమున్ సంపద నాకు సాటిగ, జనుల్ ప్రార్థింప నాకల్పభూ
మిజమున్ వారల కిచ్చితిన్ గలవటే కర్తవ్యముల్ నాకికన్!

విదూ : వయస్యా! నీ శత్రు వగు నా మాతంగహతకుఁడు మహాసాహసికుఁడు. అట్టి తఱి ప్రధానామాత్యరక్షితమైనను నీ రాజ్యము నీవు లేనిచో సురక్షితము కాఁజాల దని నా యభిప్రాయము.

జీ.వా : ఛీ! మూఢాత్మా! మాతంగుఁడు మన రాజ్యము నపహరించు ననియా నీ భయము?

విదూ : ఔను.

జీ.వా : ఐన నేమి? నా శరీరమును సైత మితరుల కీయ వెనుదీయను. కేవలము తండ్రిగారి మూలముననే కదా స్వయముగ నీ రాజ్యము నొరుల కీయఁజాల కున్నాను? కానిమ్ము. ఎందుల కీ రాజ్యమునుఁ గూర్చిన వ్యర్థ తర్కము? ముందుగఁ దాతపాదుల యాజ్ఞాప్రకారము చేయుట మంచిది. తండ్రిగారు "వత్సా! జీమూతవాహనా! చాలకాలమునుండియు నీ ప్రాంతముననే నివసించి యుండుటచే సమిత్కుశాదికము దూరదూర మగుచున్నది. ఇచటి కందమూలఫలాదులును సంపూర్ణముగ నుపయుక్తములైనవి. కావున మలయపర్వతోపత్యకల నెందేని నివాసయోగ్య మగు నాశ్రమస్థాన ముండవచ్చును. చూచి రమ్ము" అని యాజ్ఞాపించి యున్నారు గదా! రమ్ము. మలయపర్వత పరిసరములకుఁ బోవుదము.

విదూ : అటులనే కానిమ్ము. (ఇరువురును నడతురు) (ఎదుట జూచుచు) వయస్యా! చూచితివా, సరస చందన వనీ సంచారోపలబ్ధామోదంబును, అధిత్యకాపాత జర్ఝరిత నిర్ఝర శీకరాసార ప్రసారకంబు నగు నీ మలయ మారుతము ప్రథమ సమాగమోత్కంఠా పరవశిత ప్రియా స్వయంగ్రహ పరిష్వంగము వలె రోమాంచ కారియై నీ మార్గశ్రమమునుఁ దొలగించుచున్నది.

జీ.వా : (చూచి, ఆశ్చర్యముతో) ఏమి! మలయపర్వతముఁ జేరితిమా? (అంతటనుఁ బరికించి) ఆహా! ఈ మలయాచల మెంత మనోహరముగఁ గన్పట్టుచున్నది, ఏల యన:

సీ॥ గజఘటాగండ సంఘట్టనంబుల నూగు
సరస చందనభూజ జాల మొకట

సురగుహాసంచారగురుతరం బౌ వార్ధి
చలతరంగాఘాతశబ్ద మొకట
సిద్ధాంగనాపాదసిక్త రక్తాలక్త
రంజిత మణిశిలాపుంజ మొకట
అభ్రంకషా భోగ విభ్రాజితాధిత్య
కాన్త విశ్రాన్త మేఘాలి యొకట

తే.గీ. ఫలభరానమ్రమౌ వృక్షపంక్తి యొకట
మంద సంచారి మృగవధూ బృంద మొకట
వింత శోభలఁ గూర్పంగ వినుతిఁ గాంచు
మలయ భూధర మానంద నిలయ మగుచు.

రమ్ము; మన నివాసమున కనువగు నొక యాశ్రమస్థాన మన్వేషింతము.

విదూ : అటులే చేయుదము. (ఎదుట నడచుచు) ఇటురమ్ము. (ఎక్కుట నభిన యింతురు.)

జీ.వా : (కుడి క న్నదురుట నభినయించి, ఆలోచించుచు) మిత్రమా!

తే.గీ. అదరుచున్నది కుడి నేత్ర మాగకుండ
నఱయ నా కిట లేదు ఫలాభిలాష

(ఆలోచించి)

మౌని వాక్యంబు లర్థంబు లేని వగునె!
లాభ మెయ్యది మన కిట లభ్య మగునొ?

విదూ : ఏదియో సమీపస్థమగు శుభమును సూచించుచున్నది.

జీ.వా : ఔను. అది నిజమే.

విదూ : వయస్యా! అటు చూడుము. ఘనవృక్షావలీ సంశోభితమును, హవిర్గంధామోది ధూమోద్గమమును, నిర్భయోపవిష్టహరిణ శాబకమును నగు నా ప్రాంతము తపోవనము వలె కన్పట్టు చున్నది.

జీ.వా : బాగుగనే యూహించితివి. ఇది తపోవన మనుటలో సందియము లేదు. ఏల యన__

సీ॥ మునిజనంబులు వస్త్రములకునై చర్మంబు
  లొల్చిన పూత వృక్షౌఘ మిదియె
ఆజన్మసిద్ధమౌ నైజవైరముఁ బాసి
  సాధు వృత్తము జంతుసార్థ మిదియె
భగ్నకమండలు వ్యాకీర్ణ మౌ శుభ్ర
  జల శోభితంబు కాసార మిదియె
బ్రహ్మచారులు వాడి పారవైచిన జీర్ణ
  మౌంజీ గుణంబుల పుంజ మిదియె

తే.గీ. మాటిమాటికి విను నలవాటుచేత
సామములఁ బాడు నిదె శుకశారికాళి
పావనం బగు తాపస వన మటంచుఁ
జెప్పకయ చెప్పుచున్న దీ చెలువుఁ జూడ.

రమ్ము. లోనికిఁ బోయి చూతము. (ప్రవేశము నభినయింతురు.)

జీ.వా: (ఆశ్చర్యముతోఁ జూచుచు) ఆహా! ఈ తపోవన మెంత ప్రశాంతముగ నున్నది. ఒకచో సందిగ్ధవేద వాక్యార్థవిచారణాయత్తులగు తపోధనులును, వేరొక్కచో స్వాధ్యాయాధ్యయనముఁ జేయుచు శుష్కాశుష్క సమిత్పంకలన వ్యాపృతులగు బ్రహ్మచారులును, మఱియొక్కచో బాలపాదపాలవాలసేకం బొనర్చు తపోధన బాలికలును, నీ యాశ్రమమున కపూర్వ సౌందర్య మొసగుచున్నారు. ఇచట—

తే.గీ. భ్రమరరుతముల స్వాగతోద్యమును నెఱపి
ఫలభరంబున శిరముల నిలకు వంచి
పుష్పవృష్టుల నర్ఘ్యసంపూర్తిఁ జేయు
నవనిజంబులు నాతిథేయములు వోలె.

ఈ తపోవనము నివాసమున కెంతయు ననుకూలమై మన కమితసౌఖ్యము గలిగించునని తలంతును.

విదూ: (ఇటు నటు పరికించి) వయస్యా! ఈ హరిణములు కించిదాకుంచిత కంధరములై నిశ్చలములగు ముఖాగ్రములనుండి యర్ధచర్వితములగు దర్భకవలములు జారఁ జెవుల నిక్కించి యర్ధనిమీలిత నేత్రములతో నెద్దియో వినుచున్నటులఁ గానఁబడుచున్నవి.

జీ.వా: (విని) బాగుగ నూహించితివి. ఏలయన—

ఉ. స్థానవిశేషయోగమునఁ దారము మంద్రము మధ్య మొప్పఁగా
మానితవల్లకీ మధురమంజులనిక్వణ రమ్యరమ్యమౌ
గానము నర్ధ భుక్త తృణ ఖండన చర్చర శబ్ద మాపుచున్
వీనుల నిక్కఁబెట్టి మృగబృందము లిచ్చట నాలకించెడున్.

విదూ: వయస్యా! ఈ తపోవనమున గానము చేయుచున్నవా రెవరై యుందురు?

జీ.వా: కోమలాంగుళీ వాదితములగు నీ వీణాతంత్రుల యస్పష్టక్వణితముఁజూడ నీ గానము కాకలీప్రధానమై కన్పట్టుచున్నది. (వ్రేలితో నెదుటఁ జూపుచు) అదే, యీ దేవాలయమున నొక సురయువతి దేవి నారాధించుచు వీణా వాదనముఁ జేయుచున్నది.

విదూ: రమ్ము. మనము కూడ నీ దేవాలయమునఁ బ్రవేశింతము.

జీ.వా: బాగుగఁ జెప్పితివి. దేవతారాధనము యుక్తమే. (నడచుచు ఆగి) ఈమె ప్రత్యక్షదర్శనానర్హ యగు పరకాంత కావచ్చును. కావున నీ తమాల వృక్షముల మాటున దాఁగి దేవీదర్శనసమయమునకై నిరీక్షింతము. (అట్లే చేయుదురు.)

(నేలపై గూర్చుండి వీణావాదనముఁ జేయు మలయవతియుఁ చేటియుఁ బ్రవేశింతురు).

మలయవతి : (గానము చేయుచుండును.)

కం. పంకేరుహముఖి వికసిత
పంకజకేసర పరాగ భాసుర గాత్రీ!
సంకల్పము లీడేర్పుము
పంకము లెడఁబాపి లోకపావని, గౌరీ!

జీ.వా : (గీతము నాలకించి) ఆహా, ఏమి గానము! ఏమి వీణావాదనము!

పదియున్ వ్యంజన ధాతువుల్ క్రమమునన్ స్పష్టంబులై యొప్పసం
విదితం బౌ ద్రుతమధ్య లంబితభిదావిఖ్యాతమౌ నీ లయం
బిదె గోపుచ్ఛముఖంబులౌ యతులు మూ డింపారు వ్యక్తంబులై
మది( దత్త్వానుగతౌఘవాద్యము లిడున్ మందేత రానందమున్.

చేటి : (సస్నేహముగా) రాజకుమారీ! వీణావాదనము( బ్రారంభించి చాల సేపైనది. సుకుమారము లగు నీ యంగుల్యగ్రము లలసట( జెందుట లేదా?

మల : (సాక్షేపముగా) చతురికా! దేవీసమక్షమున వీణావాదనము జేయు చుండగనా నా యంగుల్యగ్రము లలసట( జెందుట?

చేటి : రాజకుమారీ! కుమారీజనదుష్కరము లగు కఠిన నియమోపవాసాదులచే నిన్నాళ్ళనుండి కొలుచుచున్నను ననుగ్రహము( జూపని యీ కరుణా విరహిత యగు దేవి యెదుట వీణావాదనము( జేసి యేమి ప్రయోజనము?

విదూ : వయస్యా! ఈమె కన్యయే కదా! మన మేల( జూడరాదు?

జీ.వా : తప్పక చూడవచ్చును. కన్యకాదర్శన మనిషిద్ధము. కాని, మనల( జూచి కుమారీజనసహజలజ్జా వశంవదయై యీమె వెడలిపోవచ్చును. కావున నీ తమాల తరువుల మాటునుండియే చూతము. (ఇరువురును( జూచు చుందురు.)

విదూ : (చూచి ఆశ్చర్యముతో) వయస్యా! చూడుము, చూడుము, ఏమి యాశ్చర్యము! వీణావాదనముచే( గర్ణానందమును( గల్గించుటయే గాక యీ కుమారీమణి తన వీణా విజ్ఞానానురూప మగు రూపసంపదచే నేత్రా నందము( గూడ( గలిగించుచున్నది. ఈమె దేవతాకుమారియా, నాగ కన్యయా, విద్యాధరబాలికయా, లేక సిద్ధకులసంభూతయా? ఎవ్వతె యై యుండును?

జీ.వా : (సాదరముగ( జూచుచు) మిత్రమా, ఈమె ఎవ్వతెయో తెలిసికొన( జాలను. కాని, నా యభిప్రాయముచే—

మ. బలభిన్నేత్రసహస్ర మందు ఫలమున్ స్వర్నారి యైనన్ రసా
తలముం గాదిక, జంద్రహీన మహిరాత్రిన్వంగియే యౌనెడన్
బళి! విద్యాధరవంశ యేని కలరే మాకున్ సమానుల్ జగం
బుల సిద్ధాన్వయ యేని సిద్ధులు మహాపుణ్య ప్రసిద్ధుల్ కదే!

విదూ : (నాయకుని జూచుచు సంతోషముతో, దనలో) అదృష్ట వశమున నీనాటికి గదా మిత్రుడు దనంగుని బారి బడినాడు! (భోజనము నభిన యించి తన్ను జూపుచు) కాదు కాదు, ఈ బ్రాహ్మణుని బారిం బడినాడు.

చేటి : (నేహపూర్వకముగా) ఇన్నాళ్ళ నుండియు ననుగ్రహింపని యీ దయా విహీనురాలి యెదుట వీణా వాదనముc జేయ నేమి లాభ మని యడుగు చున్నాను. (వీణను లాగికొనును)

మల : (కోపముతో) ఓసీ! భగవతి యగు గౌరిని నిందింపకుము. ఈ రోజుననే భగవతి న న్ననుగ్రహించినది.

చేటి : (సంతోషముతో) ఏ మని యనుగ్రహించినది? చెప్పుము.

మల : నేడు స్వప్నమున నీ వల్లకినే మ్రోగించుచుండ భగవతి కాత్యాయని "కుమారీ! నీ వీణావిజ్ఞాన విశేషమునకును, కుమారీ జనదుర్లభ మగు నీ భక్తిభావమునకును మిగుల సంతోషించితిని. విద్యాధర సార్వ భౌముడు నిన్ననతికాలముననే వివాహ మాడగలడు" అని యను గ్రహించినది.

చేటి : (సంతోషముతో) అటులైనచో రాజకుమారీ! స్వప్న మనెద వేల? భగవతి నీ హృదయాభిలషిత మగు వరవిశేషమును బ్రసాదించిన దని చెప్పుము.

విదూ : వయస్యా! దేవీదర్శనమున కిదియె మంచి తరుణము. రమ్ము.

జీ.వా : నేను రాను.

(విదూషకుడు నాయకుని బలాత్కారముగ లాగికొనిపోవును; ఇరువు రును దేవాలయమును బ్రవేశింతురు.)

విదూ : (సమీపించి, నాయికతో) "స్వస్తి భవత్యై." చతురిక మాట నిజమే. ఇదే దేవీప్రసాదిత మగు వరవిశేషము!

మల : (ససంభ్రమముగా లేచుచు జీమూతవాహను నుద్దేశించి జనాంతికముగా) ఈతఁ డెవరు?

చేటి : (జీమూతవాహనునిఁ జూచి జనాంతికముగా) అనితర సాధారణ మగు నీ యాకృత్యౌన్నత్యమునుఁ జూడ నీతఁడే యా గౌరీ ప్రసాద మని తోఁచుచున్నది. (మలయవతి సలజ్జాభిలాషయై జీమూతవాహనునిఁ జూచుచుండును.)

జీ.వా :

తే.గీ. తరల తరలాయతాక్షి యో తరుణి! యేల
సంభ్రమోత్కంపి పీవర స్తనవినమ్ర
మైన సుకుమార తనువల్లి నలఁచె దిట్లు
మున్నె తపముల నలసటఁ బొంది యుండ?

మల : (జనాంతికమున) చతురికా, అవేగాతిశయముచే నీతని యెదుట నిలువఁ జాలకున్నాను. (లజ్జతో నాయకు నడ్డముగాఁ జూచుచు ముఖమునుఁ గొంచెము త్రిప్పును.)

చేటి : రాజకుమారీ! ఏమిది?

మల : ఈతని యెదుట నిలువఁజాలను. రమ్ము; మఱి యొక్క చోటికిఁ బోవుదము. (పోవ నుంకించును.)

విదూ : వయస్యా! ఈమె భయపడుచున్నది. చూడుము, నా బుద్ధి చాతుర్యముచే నీమెనుఁ గొంత సేపాపెదను. (ఆలోచించి) ఏమమ్మా! వచ్చిన యతిథిని మాటలచే నైన గారవింపకుండుట మీ తపోవనములోని మర్యాదయా!

చేటి : (జీమూతవాహనునిఁ జూచి, తనలో) ఈమె దృష్టి ప్రేమ రసార్ద్రమై కన్పట్టుచున్నది. కానిమ్ము; ఇటు లనెదను. (ప్రకాశముగా) రాజకుమారీ! ఈ బ్రాహ్మణుని మాట నిజమే. అతిథిసత్కారము మన కర్తవ్యము గదా? నీ విట్టి మహానుభావుల విషయమునఁ గింకర్తవ్యతావిమూఢవై నిలచితివేల? పోనిమ్ము. నీ వటులనే యుండుము. నేనే యుచిత సత్కారాదులఁ జేసెదను. (జీమూతవాహనునితో) మహాత్ములకు స్వాగతము. ఈ యాసన మధిష్ఠించి యీ ప్రదేశము నలంకరింపుడు

విదూ : వయస్యా! ఈ చతురిక చెప్పునది బాగుగ నున్నది. క్షణకాలము కూర్చుండి విశ్రమింతము.

జీ.వా : కానిమ్ము. (కూర్చుందురు.)

మల : (చేటితో) ఓసీ! యిట్లు చేయవలదు. నీ పరిహాసము మాట యటుండ నెవ్వరైన తపోధనులు చూచినచో నన్నన్యథా భావింతురు.

(తాపసుఁడు ప్రవేశించును.)

తాపసుఁడు : కులపతి యగు కౌశికులు "వత్సా శౌండిల్యా! భవిష్య ద్విద్యాధర చక్రవర్తి యగు జీమూతవాహనుఁడీ మలయపర్వతమున నెచ్చటనో యున్నాఁడు. వానినిఁ జూచి తన సహోదరికి వరునిగా నిశ్చయించుటకు సిద్ధయువరా జగు మిత్రావసుడు పితృాజ్ఞానుసారముగఁ బోయి యున్నాడు. మలయవతి ఆతని రాకకై నిరీక్షించినచో మధ్యందివస సవనసమయము గూడ దాటిపోవచ్చును. కావున నామెనుఁ దీసికొని రమ్ము" అని యాజ్ఞాపించి యున్నారు. కావున గౌరీమందిరమునకుఁ బోయి మలయవతినిఁ బిలచెదను. (నడఁచి; నేలపైఁ జూచుచు, నాశ్చర్యముగా) ఈ పాంసుల ప్రదేశమున నెవ్వరిదీ విస్పష్టచక్రచిహ్నాంకిత మగు పద పంక్తి! (ఎదుట జీమూతవాహనునిఁ జూచి) ఇది తప్పక యీ మహాపురుషుని పదపంక్తియై యుండును. ఏలయన.

శా. భ్రూమధ్యంబున నూర్ణ, శీర్షమున నీ పుణ్యస్ఫుటోష్ణీషమున్
దామాంచజ్జలజానుకారి నయన ద్వంద్వంబు వ్యూఢం బురం
బీ మత్స్యధ్వజచక్రలాంఛిత పదం బీ యద్భుతాకార మీ
ధీమంతున్ దగఁ దెల్పు భావివిలసద్విద్యాధరైకాధిపున్.

ఇంకను సందియ మేల? ఈతఁడే యా జీమూతవాహనుఁడు. (మలయవతినిఁ జూచి) రాజపుత్రి మలయవతియు నిచటనే యున్నదే! (ఇరువురనుఁ జూచి) పరస్పరానురూపులగు వీర లిరువురనుఁ గూర్చిననే చతుర్ముఖుడి నాటికి యుక్తకారి యగును.(సమీపించి నాయకు నుద్దేశించి) "స్వస్తి భవతే."

జీ.వా: మహాత్మా! జీమూతవాహనుఁడ నభివాదనముఁ జేయు చున్నాను. (లేవబోవును)

తాప : లేవకుము లేవకుము. "సర్వస్యాభ్యాగతో గురుః" అనినట్లు నీ విపుడు మా కెల్లరకుఁ బూజ్యుఁడవు. సుఖముగాఁ గూర్చుండుము.

మల : ఆర్యా! నమస్కారము.

తాప : "అనురూప భర్తృలాభసిద్ధిరస్తు." రాజకుమారీ! మధ్యాహ్న స్నానవేళ యతిక్రమింపకుండ శీఘ్రముగ రావలయునని కులపతి కౌశికులు నిన్నాజ్ఞాపించుచున్నారు.

మల : గురుజనాజ్ఞ యనతిక్రమణీయము. (లేచి నిట్టూర్చుచు, తనలో)

కం. ఒక దెస గురుజనవచనం
బొక దెస ప్రియదర్శనమున నొనరెడు సుఖమున్
వికలంబై నా మానస
మకటా స్థితిగతుల నూగులాడెడుఁ దలఁపన్.

(లజ్జానురాగములతో నాయకుని నేత్రాంతములఁ జూచుచు తాపసునితో నిష్క్రమించును.)

జీ.వా : (సోత్కంఠముగ నిట్టూర్చి, మలయవతినిఁ జూచుచు)

తే.గీ. లసితజంగమ కాంచన లతిక వోలె
లలిత విభ్రమ మాధుర్య కలిత గతుల
మెల్లమెల్లన నటు వోవు పల్లవోష్ఠి
నాదు హృదయాన పద మిడె గాదె యిచట.

విదూ : వయస్యా! చూడఁదగినది చూచితిమి. వినఁదగినది వింటిమి. మాధ్యందినార్కసంతాపద్విగుణీకృతము వోలె నా జాఠరాగ్ని భగ భగ మనుచున్నది. రమ్ము. పోవుదము. బ్రాహ్మణుఁడను. ఏ తాపసునకైన నతిథినై, యాతఁ డిచ్చిన కందమూలాదులచేనైనఁ బ్రాణముల నిలుపుకొందును.

జీ.వా : (పైకి చూచి) భగవంతుఁ డగు సహస్రమరీచి మాలి యాకాశమధ్యము నధిష్ఠించియున్నాఁడు. చూడుము—

చ॥ ఒఱయుచు చందన ద్రుమము నుద్గత తద్రస పాండుగండమై
యఱి ముఱి గర్ణతాలపవనాంకురవీచుల మోము వీచుచున్
గరపరిముక్త శీకర నికాయములన్ దనమేనఁ జల్లుచున్
కరివరమౌర! శల్లక నగంబునుఁ బోలెడు సూర్యతప్తమై.

కావున రమ్ము మనము కూడఁ బోవుదము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.

శ్రీః

# ద్వితీయాంకము

## ప్రవేశకము

(చేటి ప్రవేశించును)

చేటి : రాజకుమారి మలయవతి "మనోహరికా! నా సోదరుఁడగు మిత్రావసువు నేఁడేలనో జాగు చేయుచున్నాఁడు; శీఘ్రముగఁ బోయి యాతఁడు వచ్చెనో లేదో తెలిసికొని రమ్ము" అని యాజ్ఞాపించినది. కావున నటులనే చేయుదును. (నడచి, తెర వంకఁ జూచుచు) ఎవరీమె? తొందరగా నీవైపు వచ్చుచున్నది? (జాగుగఁ బరికించి) ఒహో! చతురికయా? (రెండవ చేటి ప్రవేశించును.) (సమీపించి) సఖీ చతురికా! ఏమిది; నన్ను తప్పించుకొని తొందరగాఁ బోవుచున్నావు?

చతు : సఖీ మనోహరికా! రాజకుమారి మలయవతి "చతురికా! నా శరీరము పుష్పావచయశ్రమమునకుఁ దాళఁజాలకున్నది. శరత్కాలాతపసంజనిత మగు నీసంతాపము మిగుల బాధాకరముగ నున్నది. కావున, నీవు పోయి బాలకదలీతరుపరివృత మగు చందనలతాగృహమునఁ జంద్రమణిశిలా కుట్టిమమును విశ్రమింప సన్నద్ధము చేయుము" అని యాజ్ఞాపించినది. నేను నా విధముగఁ జేసి యామె కెఱిఁగింపఁ బోవుచున్నాను.

మనోహరిక : అటులైన శీఘ్రముగఁ బోయి చెప్పుము.

చతు : (నవ్వుచు తనలో) ఆమె సంతాపము మామూలు తాపమైన గదా శాంతిం చుటకు? అందమైన చందనలతాగృహమునుఁ జూడగనే నీమె సంతాప

మధికమగు నని నా నమ్మకము. (ప్రకాశముగా) నీవు పొమ్ము. మణిశిలా తలము సన్నద్ధము చేసితి నని నేను రాజకుమారికిఁ దెల్పెదను. (యిరువు రును నిష్క్రమింతురు.)

ఇది ప్రవేశకము

(ఉత్కంఠిత మానస యగు మలయవతియుఁ, జేటియుఁ బ్రవేశింతురు.)

మల : (నిట్టూర్చి; తనలో) హృదయమా! ఆ నాఁడు నన్నాతనియెడ లజ్జా పరాఙ్ముఖినిఁ జేసి నేడు నీ వాతని కడకే పోవుచుంటి వేల? నీ కీ స్వార్థపరత్వము న్యాయ్యమా? (ప్రకాశముగా) చతురికా! దేవీ మందిర మార్గమునుఁ జూపుము.

చేటి : చందన లతా గృహమునకుఁ గదా రాజకుమారి బయలుదేరినది?

మల : (సిగ్గుతో) ఔను; బాగుగ స్మరింపఁజేసితివి,రమ్ము. అచటికిఁ బోవుదము.

చేటి : రాజకుమారీ! ఇటు, ఇటు (చతురిక చందన లతాగృహమునకుఁ బోవును. మలయవతి మఱి యొక వైపునకుఁ బోవుచుండును.)

చేటి : (వెనుకకుఁ జూచి; యావేగముతో, తనలో) ఔరా! ఈమె యెంత శూన్య హృదయగా నున్నది! ఆ దేవీ మందిరమునకే పోవుచున్న దే!(ప్రకాశముగా) రాజకుమారీ! చందన లతాగృహ మీ వైపున నున్నది. ఇటు రమ్ము. (మలయవతి లజ్జాస్మితముతో నటు లేగును.)

చేటి : ఇదిగోఁ జందన లతాగృహము. రాజకుమారీ! దీనిఁ బ్రవేశించి చంద్ర కాంత మణికుట్టిమమున విశ్రమింపుము (ఇరువురునుఁ గూర్చుందురు.)

మల : (నిట్టూర్చి, తనలో) ఓయీ, కుసుమాయుధా! సౌందర్యాతిశయముచే నిన్ను జయించిన యాతని నేమియుఁ జేయఁజాలక యబలను కదా యని నిరపరాధిని యగు నన్ను బాధింప నీకు సిగ్గెల లేదు (తన దేహ మునుఁ జూచుకొని మదనావస్థనభినయించుచు; ప్రకాశముగా) చతురికా! నిబిడ పల్లవ నిరుద్ధ రవికర ప్రసారమైన నీ చందనలతా గృహము నా సంతాపముఁ దొలఁగింపఁజాల కున్న దేమి?

చేటి : (నవ్వుచు) ఈ సంతాపకారణమును నే నెఱుగుదును. కాని, యవిశ్వాస శీల యగు రాజకుమారి యొప్పుకొనక పోవచ్చును.

మల : (తనలో) ఈమె నా రహస్యముఁ గనుఁగొనిన ట్లున్న దే! ఐనను అడిగి

చూచెదను. (ప్రకాశముగా) చతురికా! నేనొవ్వుకొనకపోవుట కది యేమి? ఆ కారణ మెద్దియో చెప్పుము.

చేటి : అదే, నీ హృదయస్థ వర విశేషము.

మల : (సంతోషముతో; తొందరగ లేచి రెండు మూఁడడుగులు వేసి) ఏది? అతఁ డెక్కడ?

చేటి : (లేచి, నవ్వుచు) రాజకుమారీ! ఎవ్వఁడాతఁడు?

(రాజకుమారి సిగ్గుతోఁ దల వంచి కూర్చుండును.)

చేటి : రాజకుమారీ! నే చెప్పిన దేమన - స్వప్నమున దేవి యనుగ్రహించిన వరుఁడు నీ హృదయమునఁ బ్రవేశించెను. పరిత్యక్త కుసుమబాణుఁ డగు మీనధ్వజుని వలె నాతఁడే పిదప నీ కంటఁ బడెను. అతఁడే యీ సంతాపమునకు మూల కారణము. కావుననే స్వభావ శీతలమయ్యు నీ చందన లతా వలయము నీ సంతాపముఁ దొలఁగింపఁజాలకున్నది.

మల : (చతురిక ముంగురుల నిమురుచు) ఓసీ, నీవు నిజముగఁ జతురికవే! నీ కడ దాచనేల? చెప్పెదను వినుము.

చేటి : రాజకుమారీ! ఇఁకఁ జెప్పుట కేమున్నది? వేయేల? మదన సంతాపమును సహింపుము. నిజముగ నేన చతురికనైనచో నేను కనుగొనిన విషయమును వినుము. రాజకుమారీ దర్శనము లేనిచో నాతఁడుగూడ క్షణమైన నొరులతో గడుపఁజాలఁ డని నా నమ్మకము.

మల : (దైన్యముతో) నా కట్టి యదృష్టము గూడనా!

చేటి : అటు లనకుము. వక్షమున లక్ష్మిని విడచి మధుసూదనుఁడు సుఖముగ నుండఁగలఁడా ?

మల : స్వజనము ప్రియవాక్యములఁ గాక వేరొం డెట్లు పల్కును? సఖీ! సంభాషణ మాత్రముచే నైనను సత్కరింపని నన్నాతఁడు మర్యాద యెఱుగని మగువ యని భావించు నేమో యను సందేహ మన్నింటికంటెను నన్నధికముగ బాధించుచున్నది. (విచారించును.)

చేటి : రాజకుమారీ! విచారింపకుము. (తనలో) ఇంతకును విచారింపక యెట్లుండ గలదు? ఈమె తాప మధిక మగుచున్నది. ఇపు డేమి చేయుదును? ఈమె

వక్షమున చందనలతారసముఁ బిండెదను. (లేచి చందన లతా పల్లవములఁ బిడిచి రసము నామె వక్షముపై బోయును.) రాజకుమారీ! విచారింపవల దని చెప్పుచున్నాను గదా! వయోధరాభోగానులిప్త మగు నీ చందన రసము సంతతాశ్రుధారలచే నుష్ణీకృతమై హృదయ సంతాపముఁ దొలఁగింపఁ జాలకున్నది. (అరటి యాకుతో వీచును.)

మల : (చేతితో నివారింపుచు) సఖీ! వీవకుము. ఈ కదలీ పత్రవాతము చాల వేఁడిగనున్నది.

చేటి : ఇందులకు దీని దోష మేమున్నది?

తే.గీ. బాలచందన పల్లవ జాల యోగ
పరమశీతంబు కదలికా పత్రపవన
మౌర! వడగాలి యయ్యె నీ యతితరోష్ణ
గాఢనిశ్శ్వాసపవన సంకలిత మగుట.

మల : (కన్నీటితో) సఖీ! ఈ సంతాపశాంతి కేమైన నుపాయ మున్నదా?

చేటి : లేకేమి? ఆతఁ డిటకు వచ్చుటయే!

(జీమూత వాహనుఁడు, విదూషకుఁడును ప్రవేశింతురు.)

జీ.వా:

శా. చేతోహారి సితాసితేక్షణ రుచుల్ చెన్నొంద వృక్షంబులన్
వాతాధూత మృగాజినాంచితరుచుల్ బంధించు నీ బాల నన్
సాతత్యాధ్య కటాక్ష బాణ తతులన్ బాధింప నో మన్మథా
నీ తీవ్రాశుగజాల మెందులకొ నన్ బీడింపఁ జాల్ చా లికన్.

విదూ : వయస్యా! నీ పూర్వ ధైర్య మంతయు నెచటికిఁ బోయినది?

జీ.వా.: మిత్రమా! నా ధైర్యమున కేమి లోపము వచ్చినది? ఏలయన—

మ. కడుపన్ లే దటె చంద్రికాంచిత నిశల్ కంజాలి మూర్చోనఁటే
వడ నున్మీలితమాలతీ సురభియౌ వాతోద్ధతిన్ సైపనే

వెడ నిందీవరచారి భృంగరుతిచే వేధింపనే వీనులన్
గడు ధీరున్ నను నేల భీరు వనుచున్ గర్హించెదో మిత్రమా!

(ఆలోచించి) ఔను నీ మాటయే యథార్థము. నేను నిజముగ నధీరుఁడనే!

ఆ.వె. నైపఁజాల నైతి సాంద్రచేతో భీతిఁ
గుసుమబాణుని బాణ కుసుమములను
ధీరుఁడ నెటు లౌదు భీరుచేతస్కుఁడ
నీదు వాక్యమరయ నిక్కువంబు.

విదూ : (తనలో) ఈ యధీరత్వాంగీకారమునుఁ జూడ నీతని హృదయావేగము మిక్కుట మగుచున్న ట్లున్నది. వీని మానస మన్యథా మరలింతును. (ప్రకాశముగా) వయస్యా! ఏమిది, నేడు నీ గురుజన శుశ్రూషను శీఘ్రము గనే ముగించి యిటకు వచ్చితివి?

జీ.వా.: వయస్యా! యుక్తముగఁ బ్రశ్నించితివి. నీకుఁ గాక వేరెవ్వరికిఁ జెప్పుదును? నే డొక స్వప్నముఁ గంటిని. అందు నా ప్రేయసి ప్రణయ కుపితయై (వ్రేలితోఁ జూపుచు) యీ చందనలతా గృహమందలి చంద్ర కాంత మణిశిలా వేదికపైఁ గూర్చుండి నన్నేమేమియో నిందించుచు నేడ్చుచున్నటులఁ గానఁబడినది. కావున నీ దివసశేషమును స్వప్నాను భూత ప్రేయసీ సమాగమ మనోహర మగు నీ ప్రదేశమునఁ గడువ వలయు నని తలఁచుచున్నాను. రమ్ము అచటికే పోవుదము.

విదూ : ఇటు రమ్ము. (నడతురు)

చేటి : (విని ససంభ్రమముగా) రాజకుమారీ! పదశబ్దము వలె నున్నది.

మల : (ససంభ్రమముగా, దనవంకఁ జూచుకొనుచు) నా యీ యాకారమునుఁ జూచి యెవ్వరైన నా మానసగతాభిప్రాయమునుఁ గనుగొనెదరేమో! లెమ్ము. ఈ రక్తా శోక వృక్షము వెనుకఁ దాగి వారెవ్వరో చూతము (అటులె చేయుదురు).

విదూ : ఇదిగో చందన లతాగృహము రమ్ము ప్రవేశింతము.

(ప్రవేశము నభినయింతురు.)

జీ.వా.: (చూచి)

కం. చందనలతాగృహం బిది
యిందుముఖీ రహితమౌట నిందుమణి శిలా
సందోహాన్విత మైనను
చందురు నెడఁబాయు రజని చందమె దోఁచున్.

చేటి : రాజకుమారీ! ఏమి నీ యదృష్టము? ఇదే నీ హృదయవల్లభుఁడు.

మల : (ఆనందావేగములతోఁ జూచుచు) చతురికా, వీనినిఁ జూచినతోడనే పెంపొందిన హృదయావేగముచే వీని సమీపమున నిలువఁ జాలకున్నాను. ఇతఁడు నన్ను జూచునేమో? రమ్ము మఱియొక ప్రాంతమునకుఁబోవుదము. (వణకుచు నడుగువేసి) సఖీ! నా వామోరుబాగ మదరుచున్నది.

చేటి : (నవ్వుచు) పిఱికిదానా! ఇచట నుండ నిన్నెవ్వరు చూడగలరు? నీ యెదుట నశోకవృక్ష మున్న మాట మఱచితివా? ఇచటనే కూర్చుండి యుందము. (అటులఁ జేయుదురు.)

విదూ : వయస్యా! ఇదే యా చంద్రమణిశిల.

(జీమూతవాహనుఁడు నిట్టూర్పు విడచును)

చేటి : రాజపుత్రీ! మాటలు గూడ వినవచ్చుచున్నవి. శ్రద్ధగా విందము.

(ఇరువురును వినుచుందురు.)

విదూ : (చేతితో జీమూతవాహనునిఁ గదుపుచు) ఇదే యా చంద్రమణిశిల యని యనుచున్నాను.

జీ.వా : ఔను. బాగుగ నూహించితివి. (చేతితోఁ జూపుచు.)

మ. ఇదె యా చంద్రమణీ శిలాతల మిటన్ వీక్షారుచుల్ దోపఁ దా
వదనాబ్జంబునుఁ గేలఁ గూర్చి విపుల శ్వాసోద్గ మారంభయై
హృదయాభ్యంతర లీన మన్యు భరతా రీతిన్ స్వబింబాధరం
బదరన్ మద్విరహానఁ గుందెడు మదీయ ప్రేయసిన్ జూచితిన్.

ఈ చంద్రమణివేదికమీఁదనే కూర్చుందము. (ఇరువురును గూర్చుందురు)

మల : (ఆలోచించి) సఖీ! ఈమె యెవ్వతె యై యుండును.

చేటి : దాగి యుండి మన మీతనిఁ జూచుచున్నట్టు లాతఁడు గూడ నిన్నుఁ జూచి యుండలేదు కద!

మల : అటులే కావచ్చును. కాని ప్రణయకుపిత యగు నెవ్వరో యొక స్త్రీ నుద్దేశించి చెప్పుచున్నటు లున్నదే!

చేటి : రాజకుమారీ! లేనిపోని సందేహము పడకుము. ఇంకను విందము.

విదూ : (తనలో) ఈతఁడీ కథచే వినోదము నందుచున్న ట్లున్నది. కానిమ్ము దీనిఁ గూర్చియే మాటలాడుదును. (ప్రకాశముగా) వయస్యా! అమె ఏడ్చుచున్నపుడు నీ వేమంటివి?

జీ.వా : వయస్యా! నే నిట్లంటిని. "ప్రేయసీ—,

తే.గీ. నీదు బాష్పాంబు బిందు తుందిలిత మౌట
చంద్రకాంత మణీ శిలా సాంద్రతలము
త్వన్ముఖేందూదయ ప్రాప్త వారి బిందు
జాల నిష్యందనము వోలెఁ గ్రాలు నౌర!"

మల : (కోపముతో) చతురికా! ఇఁక నేమైన వినవలసి యున్నదా. (కన్నీటితో) రమ్ము, పోవుదము.

చేటి : (చేతితోఁ బట్టుకొని) రాజకుమారీ! అట్లనుకుము. నిన్నుఁ జూచినవాఁడితర కామినులఁ గూర్చి ముచ్చటించు నని నాకు నమ్మిక లేదు. కథ ముగియు నంతవఱకు నోపికపట్టుము.

జీ.వా. : మిత్రమా! ఆమె నీ శిలాఫలకముపై జిత్రించి మనోవినోద మందఁ గోరుచున్నాను. ఆ పర్వత పరిసరములనుండి మనశ్శిలా ఖండములఁ గొనిరమ్ము.

విదూ : అటులే చేయుదును. (బైటకు వెడలి తీసికొని వచ్చి) నీ వొక్క రంగు మాత్రమే చెప్పితివి. కాని నేనీ పర్వతమున లభ్యమగు నైదురంగులఁ దీసికొనివచ్చితిని. చిత్రింపుము (రంగుల నిచ్చును.)

జీ.వా. : వయస్యా! మంచి పనిఁ జేసితివి. (వాని నందుకొని శిలాఫలకముపై నా మెనుఁ జిత్రించుచు గగుర్పాటుతో) మిత్రమా! చూడుము చూడుము.

కం. బింబాధరాభిరామము
సంబాధిత చంద్రబింబ సౌందర్యం బీ
యంబుజనయనా వదనా
బ్జంబిది మది గూర్చు మోదసాంద్రత్వంబున్.

విదూ : (వేడుకతోఁ జూచుచు) వయస్యా! ఎదుట లేకున్నను నీ వామె నెంత బాగుగఁ జిత్రించితివి! చాల ఆశ్చర్యముగ నున్నది.

జీ.వా. : (చిరునగవుతో) మిత్రమా! ఇం దాశ్చర్య మెందులకు?

తే.గీ. సుదృఢ మానస భావన నెదుట నిలచు
నిత్య సాన్నిధ్యశాలి యా నీలవేణి
మాటిమాటికిఁ జూచుచుఁ బాటవాన
నామె చిత్రంబుఁ జిత్రింప నబ్బురంబె?

మల : (కన్నీటితో) చతురికా! కథాంతము తెలిసినది కదా! రమ్ము. మిత్రావసువు దగ్గరకుఁ బోవుదము.

చేటి : (విచారముతోఁ దనలో) ఈమె మాటల తీరుఁ జూడ నీమె జీవితముపై నాశ వదలుకొని నట్లున్నది.(ప్రకాశముగ) మనోహారిక యటకు వెళ్ళినది కదా, యువరాజు మిత్రావసుఁ డిచటికే రావచ్చును.

(మిత్రావసువు ప్రవేశించును.)

మిత్రా : తండ్రిగారు "కుమారా, మిత్రావసూ! ఏతత్పరిసరముల నున్న కుమారజీమూతవాహనుని బాగుగఁ బరీక్షించి మన మలయవతి కనుకూలుఁ డైన వరుఁ డని నిర్ణయించితిమి. మలయవతి నాతని కిచ్చెద మని మాట యిచ్చి రమ్ము" అని యాజ్ఞాపించిరి. కాని, సోదరీస్నేహపరతంత్రుఁడ నౌట నా పరిస్థితిఁ వేరొక విధముగ నున్నది.

రహి విద్యాధర వంశశేఖరుఁ డతిప్రాజ్ఞుండు సత్సంమతుం
డహితవ్రాతవినాశి విక్రమధనుం డాకారపుష్పేషుఁడీ
మహితాత్ముండు పరార్థమై యసువులన్ బాయంగ సన్నద్ధుఁడా
త్మహితన్ సోదరి నీనిఁ గూర్ప మది మోదం బందు దుఃఖంబునున్.

ఆతఁ డీ గౌరీ మందిర సమీపమునఁ జందనలతా గృహమున నున్నాఁ డని వినియుంటిని. ఈ చందనలతికాగృహమునకే పోయెదను. (ప్రవేశించును.)

విదూ : (ససంభ్రమముగఁ జూచి) ఈ కదలీపత్రముతో నీ చిత్రము నాచ్ఛాదింపుము. సిద్ధయువరా జగు మిత్రావసు వీ వంక వచ్చుచున్నాఁడు. దీని నాతఁడు చూచును. (కదలీ పత్రముతోఁ జిత్తరవు నాచ్ఛాదించును )

మిత్రా : (ప్రవేశించి) విద్యాధరకుమారా! మిత్రావసుఁడను, నమస్కరించుచున్నాను.

జీ.వా : (చూచి) మిత్రావసూ! స్వాగతము. ఇటఁ గూర్చుండుము.

చేటి : రాజకుమారీ! మిత్రావసుఁ డరుదెంచినాఁడు.

మల : సఖీ, చాల సంతోషము.

జీ.వా : మిత్రావసూ! సిద్ధరా జగు విశ్వావసువునకుఁ గుశలమా?

మిత్రా : తండ్రిగారు క్షేమముగ నున్నారు. వారి యానతిపైనే యిటకు వచ్చితిని.

జీ.వా : పూజ్యు లేమి యాజ్ఞాపించినారు?

మల : (తనలో) తండ్రిగారి సందేశమును విందును.

మిత్రా : మా తండ్రిగారు "సిద్ధాన్వవాయప్రాణభూత యగు నా కుమారి మలయవతిని నీ కీయ నిశ్చయించితిమి గాన నంగీకరింపుము" అని నీతోఁ జెప్పవలయు నని నన్నాజ్ఞాపించినారు.

చేటి : (నవ్వి సంతోషముతో) రాజకుమారీ! ఇపుడు నీ కోప మే మైనది?

మల : (చిఱునవ్వు నవ్వుచు సిగ్గుతోఁ దల వంచి) ఓసీ! పరిహాసముఁ జాలింపుము. ఈతఁ డన్యాయత్త హృదయుఁడౌ ట మఱచితివా?

జీ.వా : (జనాంతికముగా) మిత్రమా! చిక్కులో బడితిమే.

విదూ : (జనాంతికముగా) ఆమె తక్క మరి యెవ్వతెయు నీ మనమునకు రుచింప దని నా యాశయము కావున నేదియో యొక యుత్తర మిచ్చి వీనిఁ బంపివేయుము.

మల : దుష్టుఁడా! ఈ విషయ మెవ్వ రెఱుఁగరు?

జీ.వా : మిత్రావసూ! శ్లాఘ్య మగు మీతోడి సంబంధ మేరి కిష్టము గాకుండును? కాని, యన్యథా ప్రవర్తించిన నా చిత్తమును మఱల్చి యీమెనుఁ బ్రతి గ్రహింపఁజాలను. (మలయవతి మూర్ఛనభినయించును.)

చేటి : రాజకుమారీ ఊరడిల్లు మూరడిల్లుము.

విదూ : ఆర్యా - ఈతఁడస్వతంత్రుఁడు; వీని నడిగి యేమి ప్రయోజనము? ఈతని తలిదండ్రుల నడుగుము.

మిత్రా : (తనలో) ఈ మాటయు నిజమే; ఈతడు పెద్దల యానతి మీరఁ జాలఁడు. వీని తలిదండ్రులు నీ గౌర్యాశ్రమముననే నివసించుచున్నారు. వీరియొద్దకుఁ బోయి మలయవతినిఁ బ్రతిపాదింతును.

(మలయవతి యూరడిల్లును.)

మిత్రా : (ప్రకాశముగా) ఋజువగు మా ప్రార్థనను నిరాకరించుటకుఁ గారణ మెద్దియో మేము గూడ దెలిసికొనవచ్చునా?

మల : (కోపముతో నవ్వుచు) మిత్రావసుఁడు ప్రత్యాఖ్యానావమానితుఁ డయ్యు నెందుల కింకను మాటలాడుచున్నాడు? (మిత్రావసువు వెడలును.)

మల : (దుఃఖించుచుఁ దన్నుఁ జూచుకొని తనలో) దుఃఖైకభాజనమై దౌర్భాగ్య దూషిత మగు నీ శరీరముతోఁ బ్రతికి యేమి ప్రయోజనము? ఈ యశోక పాదపమునం దీ యతిముక్తలతతో నురి బిగియించుకొని ప్రాణముల వీడెదను. కానిమ్ము ఇట్లు అందును. (విలక్షస్మితముతో) సఖీ! మిత్రా వసుఁ డెంత దూర మేగినాఁడో చూడుము. నేను గూడ నిఁట నుండి కదలెదను.

చేటి : (కొన్ని యడుగులు వేసి తనలో) ఈమె తీరది యొక విధముగ నున్నట్లున్నది. దూరము పోకుండగ నిచటనే దాగి యీమె యేమి చేయునో చూచెదను.

మల : (నలువైపులఁ జూచుచుఁ బాశము గ్రహించి కన్నీటితో) భగవతీ, గౌరి నీ వీ జన్మమున నన్ననుగ్రహింపకపోయినను జన్మాంతరముననైన నిట్టి దుఃఖములకు గురి కాకుండు నట్లనుగ్రహింపుము. (పాశముఁ గంఠము నకుఁ దగల్చుకొనును )

చేటి : (చూచి, ససంభ్రమముగా సమీపించి) రక్షింపుడు! రక్షింపుడు! ఈ రాజకుమారి యురి వెట్టుకొని యాత్మహత్యఁ జేసికొనుచున్నది.

జీ.వా : (తొందరగా సమీపించి) ఎక్కడ? ఆమె యెక్కడ?

చేటి : ఇదిగో, అశోకవృక్షమున.

జీ.వా : (సంతోషముతోఁ జూచి) ఏమీ, నా ప్రాణప్రేయసియేశా యీమె! (మలయవతీ హస్తముఁబట్టి లతాపాశము లాగికొనును.)

ఆ.వె. చాలు చాలును బాల! నీ సాహసంబు
విడువు మచ్చట నీ లతన్ విడువు మకట
పూలఁ గోసినఁ గందు నీ పుణ్యహస్త
మెటులఁ దాకెనో పాశమున్ గుటిలకేశి.

మల : (ససంభ్రమముగా) సఖీ! ఎవ్వ డీతఁడు? (పరికించి కోపముతోఁ జేతిని లాగికొనును.) ఓయీ! విడువుము నా హస్తము. నన్ను నివారించుటకు నీ వెవ్వడవు? చచ్చుటకుఁ గూడ నీ యాజ్ఞ కావలెనా.

జీ.వా:

తే.గీ. హారలతికల ధరియింప నర్హమైన
యీ గళంబునఁ బాశంబు నిడుటకతన
సాపరాధంబు గాదె యీ హస్త మఱియ
నెటుల దీనిని విడచెద నీవ చెపుమ?

విదూ : (చేటిని సమీపించి) ఈమె మరణోద్యమమునకుఁ గారణ మేమి?

చేటి : నీ ప్రియవయస్యుఁడే!

జీ.వా : ఏమీ, నేనా యీమె మరణోద్యమమునకుఁ గారణము?! నా కేమియుఁ దెలియుట లేదు.

విదూ : అదెట్లు?

చేటి : (అభిప్రాయగర్భముగా) ఈతడు శిలాఫలకముపైఁ జిత్రించిన ప్రేయసిపై మక్కువచే మిత్రావసుఁడు స్వయముగాఁ బ్రదిపాదించుచున్నను నన్నంగీకరింపకున్నా డను నిర్వేదముచే నీమె యిటులఁ జేసినది.

జీ.వా : (సంతోషముతో, దనలో) విశ్వావసుని పుత్రియగు మలయవతి యీమె యేనా?! ఔను; రత్నాకరమునుండి గాక చంద్రలేఖ వేరెచటనుండి పుట్టును? ఔరా! నే నెంత మోసపోతిని?

విదూ : అటులయిన మా ప్రియమిత్రుఁ డనపరాధియే. ఈతఁడు చిత్రించిన దీమెనే కదా! నా మాటలను నమ్మకున్న నీవే స్వయముగఁ బోయి చూడుము.

(మలయవతి లజ్జా హర్షములతో నాయకునిఁ జూచుచు, హస్తమును లాగికొనును.)

జీ.వా : (చిరునవ్వుతో) శిలాతలముపైఁ జిత్రించిన నా ప్రేయసినిఁ జూడకుండ నిన్ను విడువను.

(అందఱునుఁ జందనలతా గృహమునుఁ బ్రవేశింతురు.)

విదూ : (అరటియాకునుఁ దొలఁగించి) ఆర్యులారా! వీని ప్రేయసినిఁ జూడుము.

మల : (చూచి నవ్వుకొనుచు, జనాంతికముగా) చతురికా! నన్నే చిత్రించి నట్లున్నది.

చేటి : (చిత్తరువు వంకను మలయవతి వంకనుఁ జూచుచు) "చిత్రించి నట్లున్నది" అనెద వేల? నీ ప్రతిబింబమా చిత్తరువా యనునట్లున్నది.

మల : (నవ్వుచు) ఈతడు నా చిత్తరువుఁ జూపి నన్నే యపరాధినిగా నిరూపించుచున్నాఁడు.

విదూ : వయస్యా! నీ కీమెతో గాంధర్వవివాహము పూర్తి యైనది. ఇఁక నీమె హస్తమును విడువుము. ఎవ్వతెయో తొందరగా నీ వైపునకే వచ్చుచున్నది.

(జీమూతవాహనుఁడు చిరునవ్వుతో మలయవతిని విడచును. చేటి ప్రవేశించును.)

చేటి : (సంతోషముతోఁ దొందరగ సమీపించి) రాజకుమారీ! నీ యదృష్టము పండినది. జీమూతవాహనుని తలిదండ్రులు అంగీకరించిరి.

విదూ : అహహా! ప్రియవయస్యు కోరికలు-కాదు కాదు-మలయవతీమనోరథము లీడేరినవి. కాదు కాదు - (భోజనము నభినయించుచు) ఈ బ్రాహ్మణుని పుణ్యము పండినది. (తన్ను జూపును.)

చేటి : (నాయికతో) యువరాజు మిత్రావసువు "మలయవతీ వివాహమహోత్సవ మంగలము నేఁడే జరుగును. ఆమెనుఁ దీసికొని శీఘ్రముగ రమ్ము" అని యాజ్ఞాపించినాఁడు కావున, పోవుదము రమ్ము.

విదూ : ఏమె! నీ వీమెనుఁ దీసికొనిపోయినచో నిచట మా మిత్రుఁడేమగు నను కొంటివి?

చేటి : (నవ్వుచు) దురాశాపరుఁడా! తొందరపడకుము. మీకుఁ గూడ స్నాన సామగ్రి సిద్ధము కావచ్చినది.

(మలయవతి అజ్ఞానురాగములతో జీమూతవాహనునిఁ జూచుచు పరివార ముతో నిష్క్రమించును. నేపథ్యమున వైతాళికులు గానము జేయుదురు.)

మ. పౌరిఁ బిష్టాతకవృష్టి మేరుసమతన్ బొందింప నీ శైలమున్
గురు సిందూర పరాగ పాటలిమలున్ గూర్పన్ ప్రభాతప్రభల్
తరుణీగానము నూపురారవమిలత్తానంబు మించన్ నిను
న్వరు సిద్ధౌఘము పాణిపీడన శుభస్నానార్థమై పిల్చెడున్.

విదూ : (విని) వయస్యా! స్నానసమయము సంప్రాప్తమైనది.

జీ.వా : (సంతోషముతో) అటులయిన నిచట నుండుట యెందులకు? రమ్ము తండ్రిగారి కభివాదనము జేసి మనముకూడఁ బోవుదము.

కం. సమ రూప కుల వయస్కుల
కమలాన్యోన్యానురాగయత చిత్తులకున్
రమణీరమణులకును సం
గమ మబ్బును పూర్వ పుణ్య గరిమమునఁ గదా!

(ఎల్లరును నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.

## తృతీయాంకము

(విచిత్ర వ్యాకుల వేషధారియై విటుఁడు పాన పాత్రతోఁ బ్రవేశించును. భుజముపై సురాభాండముతోఁ జేటుఁడు వాని ననుసరించును.)

విటుఁడు : (సంతోషముతో)

తే.గీ. కల్లుఁ ద్రావెఁడు రేవతీ వల్లభుండు
కామి జనులనుఁ గూర్చెడు కామదేవుఁ
డిద్దఱే దేవతల్ భువి నిద్ధచరితు
లన్యదైవత కోటి దయ్యముల కారె?

(ఇటునటు తిరుగుచు) ఈ శేఖరుని జీవితమే సఫలము.

తే.గీ. కమల వాసిత మదిరాక్త విమల ముఖుఁడ
హృదయ సన్నిహిత ప్రియా వదనయుతుఁడ
శీర్ష సంసక్త సుమగుచ్ఛ శేఖరుండ
శేఖరుండను నే విట శేఖరుండ.

(తూలుచు) అరే! ఎవడురా నన్నుఁ ద్రోయుచున్నాఁడు?
(సంతోషముతో) నిజముగా నవమాలికయై యుండును.

చేటుఁడు : ఆర్యా! నవమాలిక యింకను రాలేదు కదా?

విటు : మలయవతీ వివాహము తొలిజాముననే జరిగినది కదా? తెలవారుచున్నది. ఆమె యింకను రాలేదేమి? (ఆలోచించి, సంతోషముతో) ఓహో! తెలిసినది. ఈ మలయవతీ వివాహ సందర్భమున సిద్ధవిద్యాధరులెల్లరు స్వప్రేయసీ సమేతులై కుసుమాకరోద్యానమున నాపాన సుఖము ననుభవించుచుందురు. నవమాలిక కూడ నన్నెదురు చూచుచు నచటనే యుండును. నేను గూడ నటకే పోయెదను. శేఖరకుఁడు నవమాలికను వీడి యుండగలఁడా? (తూలుచు నడచును.)

చేటుఁడు : ఆర్యా! ఇదుగో కుసుమాకరోద్యానము. ప్రవేశింపుడు. (ఇరువురును నడతురు. భుజముపై వస్త్రద్వయముతో విదూషకుఁడు ప్రవేశించును.)

విదూ : ప్రియవయస్యుఁ డిపుడు కుసుమాకరోద్యానమునకుఁ బోవునని వింటిని. నేను నచటికేఁ బోయెదను. (నడచి చూచి) ఇదే కుసుమాకరోద్యానము. ప్రవేశింతును. (ప్రవేశించి భ్రమర బాధ నభినయించుచు) అరే యీ దుష్ట మధుకరములన్నియు నా మీదకే వచ్చుచున్నవే! (ఒడలు వాసన చూచికొని) ఓహో తెలిసినది. అల్లుని ప్రియమిత్రుడను గదా యని

మలయవతీ బంధుజనులు నా యొడలంతయు బహుమానపురస్సరముగా సుగంధాదులఁ బూసిరి. సంతానక పుష్పమాలను శీర్షమునఁ గట్టిరి. ఈ యాదరాతిశయమే నా కొంప ముంచినది. ఇపుడు నేనేమి చేయుదును? కానిమ్ము. మలయవతి బహూకరించిన యీ రక్త వస్త్రద్వయముతో స్త్రీ వలె నుత్తరీయమును ముసుగువైచికొని పోయెదను. ఈ దుష్టమధుకరము లిఁక నేమి చేయునో చూచెదను. (అటులే సేయును.)

విటు : (చూచి, సంతోషముతో) ఓరీ చేటా! (వ్రేలితోఁ జూపి నవ్వుచు) ఇదిగో నవమాలిక. నే నాలసించితి నను కోపముచే నన్నుఁ జూచియు మేలి ముసుగు వైచికొని యటు పోవుచున్నది. ఈమెనుఁ గంఠాలింగనముచే బతిమాలుకొందును. (తొందరగ సమీపించి విదూషకునిఁ గంఠమున నదిమి పట్టి ముఖమునఁ దాంబూలోచ్ఛిష్ఠ మిడబోవును )

విదూ : (మద్యగంధమును సూచించుచు) అరే! దూరము దూరము. (ముక్కు మూసుకొని యటు తిరిగి నిలఁబడును.) ఒక దుష్టమధుకరముల బారి నుండి తప్పించుకొని మరల నిపుడు వేరొక దుష్టమధుకరము చేతిలోఁ జిక్కుకొంటినే!

విటు : ఏమీ! కోపముచే నటు తిరుగుచున్నదా? కానిమ్ము. కాళ్ళపైఁబడి బ్రతి మాలుకొనెదను. (నమస్కరించుచు విదూషకుని పాదములనుఁ దన శిరముపై నుంచుకొని) అనుగ్రహింపుము నవమాలికా! అనుగ్రహింపుము. (చేటి ప్రవేశించును.)

చేటి : రాజకుమారి యగు మలయవతి తల్లిగారు "నవమాలికా! కుసుమాకరో ద్యానమునకుఁ బోయి 'మల యవతితోఁ గూడ మా యల్లుఁడు రాను న్నాఁడు గాన నేఁడు తమాలతరు వీథిని బాగుగ నలంకరింపు' మని యుద్యానపాలిక యగు పల్లవికతోఁ జెప్పుము" అని యాజ్ఞాపించినారు. పల్లవిక కా విషయమునుఁ దెలిపితిని. ఇఁక రజనీ విరహోత్కంఠాకులుఁ డగు ప్రియవయస్యుని శేఖరు నన్వేషింతును. (చూచి) ఇదిగో శేఖరుఁడు! (కోపముతో) పరవనిత నెవ్వతెనో బతిమాలుకొనుచున్నాఁడే! ఇచటనె నిలచి యీామె యెవ్వతెయో తెలిసికొనెదను.

విటు : (సంతోషముతో)

కం. హరిహర పితామహాదుల
 కెఱుఁగన్ వీఁడెరుగఁ డెన్నడిందుముఖీ! శే
 ఖరుఁ డిదె పదముల వ్రాలెడు
 గరుణాపాంగేక్షణములఁ గావంగదవే!

విదూ : ఓరీ నీచుఁడా! ఇచట నవమాలిక యెక్కడ నున్నది?

చేటి : (చూచి నవ్వుకొనుచు) ఏమి! మదపరవశుఁ డగు శేఖరకుఁడు నే నని తలఁచి యాత్రేయుని బతిమాలుచున్నాఁడే! కానిమ్ము. కోపము నభిన యించుచు వీరిరువురనుఁ బరిహాసించెదను.

చేటు : (చేటినిఁ జూచి శేఖరకునిఁ జేతితోఁ బొడుచుచు) ఆర్యా! ఈమెను విడువుము. ఈమె నవమాలిక కాదు. కోపముచే గందిన కన్నులతోఁ జూచుచు యిదిగో నవమాలిక యిటు వచ్చుచున్నది.

చేటి : (సమీపించి) ఎవ్వరీమె, నీవు బతిమాలుకొనుచున్నావు?

విదూ : (ముసుగుఁ దొలఁగించి) ఇదిగో దౌర్భాగ్యవంతుఁడను నేను.

విటు : (విదూషకునిఁ జూచి కోపముతో) ఓరీ! కపిల మర్కటా! శేఖరకునిఁ గూడ మోసగించుచున్నావా? (చెంపపైఁ గొట్టి) ఓరీ! వీనినిఁ బట్టుకొనుము. నవమాలికను బతిమాలుకొందును.

చేటు : చిత్తము.

విటు : (విదూషకుని విడచి చేటి పాదములపైఁ బడును.) అనుగ్రహింపుము నవమాలికా! అనుగ్రహింపుము.

విదూ : (తనలో) పారిపోవుట కిదియె మంచి సమయము. (పారిపోవ నుంకించును. చేటుఁడు విదూషకుని యజ్ఞోపవీతమున బట్టుకొనును. అది తెగి పోవును.)

విటు : కపిల మర్కటమా! ఎక్కడికిఁ బారిపోవుదువు? (ఉత్తరీయముతోఁ గంఠమున మెలివేసి లాగును.)

విదూ : నవమాలికా! దయ యుంచి నన్ను విడిపింపుము.

చేటి : (నవ్వుచు) సాష్టాంగముగ నేలపైఁ బడి నా పాదములకు నమస్క రించినచో విడిపింతును.

విదూ : (కోపముతో వణకుచు) గంధర్వరాజమిత్రుఁ డగు బ్రాహ్మణుఁడను, నీచురా లగు నీ పాదములపైఁ బడుదునా?

చేటి : (వేలితో జడిపించుచు నవ్వి) అటులనా? ఇపుడె పడవేయించెదను. (శేఖరకునితో) శేఖరకా! లెమ్ము. నిన్ననుగ్రహించితిని (కంఠము నాశ్లేషించును). అల్లుని ప్రియమిత్రుఁడగు నీ బ్రాహ్మణు నవమానించితివి. ఈ విషయము తెలిసినచోఁ బ్రభువగు మిత్రావసువు కోపింపవచ్చును. కావున నాదరపూర్వకముగా వీనిఁ గౌరవింపుము.

విటు : నీ యాజ్ఞ ప్రకారమే చేయుదును. (విదూషకుని కంఠమున నాశ్లేషించి) ఆర్యా! సంబంధివి గదా యని పరియాచక మాడితిని. నిజముగా శేఖరకుఁడు మత్తుఁ డని యనుకొనుచున్నావా?

విదూ : కాదు కాదు.

విటుఁడు : (సంతోషముతో) కేవలము పరియాచక మాడితిని. (ఉత్తరీయమును గుండ్రముగఁ జేసి యాసనముగనిచ్చును) పెండ్లివారిఁటఁ గూర్చుండుడు.

విదూ : (తనలో) మన యదృష్టముచే వీని మదావేశము తగ్గినట్లున్నది. (కూర్చుండును.)

విటు : నవమాలికా! నీవు కూడ వీని ప్రక్కనేఁ గూర్చుండుము. ఇరువుర నొక్కమారుగనే గౌరవింతును.

చేటి : (నవ్వుచు గూర్చుండును.)

విటు : ఓరీ చేటుఁడా! శ్రేష్ఠ మగు మద్యముతో మద్య పాత్రను నింపుము.

(చేటుడు పాన పాత్రను నింపును.)

విటు : (తన శిరోమాలికనుండి పుష్పముల నూడదీసి పానపాత్రలో నుంచి మున్గాళ్ళపై నిలచి నవమాలిక కందిచ్చును.) నవమాలికా నీ వాస్వాదించి వీని కిమ్ము.

చేటి : (చిఱు నవ్వుతో) అటులే చేసెదను (అట్లు చేసి విటునకిచ్చును.)

విటు : (పాన పాత్రను విదూషకున కిచ్చుచు) ఆర్యా! నవమాలికాముఖపరిమలముచే సంవర్ధిత రస మగు నీ మద్యమును శేఖరుఁడు తక్క మరి యెవ్వరు నాస్వాదించి యెరుఁగరు. దీని నాస్వాదింపుము. ఇంతకుమించిన సన్మానము మరేమి చేయుదును?

విదూ : (వెకిలి నవ్వుతో) శేఖరకా! బ్రాహ్మణుఁడను కదా?

విటు : బ్రాహ్మణుఁడవైనచో నీ యజ్ఞోపవీత మెక్కడ?

విదూ : (తన శరీరమున యజ్ఞోపవీతముఁ గానక) అది యీ చేటుఁడు లాగుచుండగాఁ దెగిపోయినది.

చేటి : (నవ్వి) అటులైనచో రెండు మూఁడు వేదాక్షరము లుచ్చరింపుము.

విదూ : ఈ మద్య గంధములో నా వేదాక్షరములు కప్పడిపోయినవి. ఇంతకు నీతో వాద మెందులకు? ఇదుగో ఈ బ్రాహ్మణుఁడు నీ పాదములపైఁ బడుచున్నాఁడు. (పాదములపైఁ బడఁబోవును.)

చేటి : (చేతులతో నివారించి) ఆర్యా! ఇటులఁ జేయకుఁడు. (శేఖరకునితో) శేఖరకా! దూరముగఁ దొలఁగుము. ఈతఁడు నిజముగ బ్రాహ్మణుఁడే! (విదూషకుని పాదములపైఁ బడి) ఆర్యా! కోపింపకుఁడు. సంబంధివి కదా యని పరిహాస మాడితిని.

విటు : నేను గూడ వీనిని బతిమాలుదును. (పాదములపైఁ బడి) ఆర్యా! మదపరవశుఁడగు నేఁ జేసిన యపరాధమును క్షమింపుము. నవమాలికతోఁ గూడి పానశాలకుఁ బోవుటకు సెలవిమ్ము.

విదూ : నే నంతయు క్షమించితిని. మీ రిరువురును వెళ్ళవచ్చును. నేను గూడ ప్రియవయస్యుని కడకుఁ బోవుదును. (విటుఁడు, చేటుఁడు, చేటియు నిష్క్రమింతురు.)

విదూ : అదృష్టవశమున బ్రాహ్మణున కకాలమృత్యువు తప్పినది. ఈ మత్తుని స్పర్శచే నపవిత్రీకృతుఁడ నగు నే నీ దీర్ఘికలో స్నానముఁ జేసి ప్రియవయస్యునిఁ జూతును. (అటులఁ జేసి తెర వైపు చూచుచు) ఇదే ప్రియమిత్రుడు మూర్తీభవించిన స్వయంవర లక్ష్మి వలె నున్న ఆ మలయవతిని హస్తమున గ్రహించి యిచ్చటికే వచ్చుచున్నాఁడు. కావున వీని సమీపమునకుఁ బోయెదను.

(వివాహ వేషాలంకృతు లగు మలయవతీ జీమూతవాహనులు సపరివారముగఁ బ్రవేశింతురు.)

జీ.వా : (మలయవతినిఁ జూచుచు—)

సీ॥ నెమ్మోము తిలకింప నిగ్గు చూపుల వ్రాల్చు
పలుకరించిన మాఱు పలుకఁబోదు
సెజ్జ చేర్ప ముఖంబు లజ్జతో నటు ద్రిప్పుఁ
గౌగిటఁ గుదియింపఁ గంప మందుఁ
గాంచీగుణము ముట్టఁ గరము నేలకుఁ ద్రోయు
ముసి ముసి నగవుల ముద్దుఁ గొలుపు
అధరంబు నాశించి యాననాబ్జం బెత్త
వ్రేళులఁ గప్పుచు వెఱగుఁ జెందు

తే.గీ. శయన మందిరమున్వీడి చనెడు సఖుల
ననుసరింపగ నుంకించు ననుకూల
రీతి సైతము మానసప్రీతిఁ గూర్చు
గాదె ముగ్ధాబ్జముఖిసంగమాది నౌర.
(మలయవతినిఁ జూచుచు) ప్రేయసీ మలయవతీ!

శా. "ఊఁ"కారంబుల నుత్తరంబు లిడి నిత్యం బందితిన్ మౌనమున్
రాకాచంద్ర మహోష్ణకాతి తతులన్ బాధించి కాయంబు నీ
యాకారంబునె నాదు మానసతటిన్ హత్తించితిన్ నిత్యమున్
నా కీ తీవ్ర తపఃఫలంబె కదటే నాతీ త్వదాలాపముల్?

మల : (అపవారించి) సఖీ! యీతఁడతిలోక సౌందర్యముననే గాక ప్రియవచన రచనా చాతురిచే గూడ నొప్పుచున్నాడు.

చేటి : (నవ్వి) ఓ భర్తృ పక్షపాతినీ! యిది యెల్లయు వాస్తవమే కాదా? ఇందుఁ బ్రియవచన మేమున్నది?

జీ.వా : చతురికా! కుసుమాకరోద్యానమునకు మార్గముఁ జూపుము.

చేటి : రాజకుమారా! ఇటు రమ్ము.

జీ.వా : (నడచుచు నాయికతో) మెల్లగా నడువుము. ఏలయన—

స్తనభారాలస మయ్యె నెన్నఁడు మిఁకన్ ధార్యంబులే హారముల్?
గనఁ గాంచీగుణ మేల యూరులు కటీక్లాంతంబులై యుండ నీ
ఘనమౌ నూపురయుగ్మ మేల పదముల్ గంపింప నూరుద్వయిన్
వనితారత్నమ! భూష లేల సహజాభాశాలికి న్నీకిటన్?

చేటి : రాజకుమారా! ఇదుగో, కుసుమాకరోద్యానము. ప్రవేశింపుము. (ఎల్లరునుఁ ప్రవేశింతురు.)

జీ.వా : (నలువైపులఁ జూచి) అహా! కుసుమాకరోద్యాన మెంత యందముగా నున్నది! ఇచ్చట—

శా. శ్రీగంధద్రుమసార్ద్రముల్ శిశిరతన్ జెందెన్ నికుంజస్థలుల్
రాగావిష్టమయూర మీ జలగృహారావంబుచే నాడెడున్
వేగోన్ముక్తము యంత్రనీర మిదె యీ వృక్షాలవాలంబులన్
సాగన్ జొచ్చెను వేగ కంపితసుమప్రస్యంద్రజః పుంజమై.

కం. పొదలన్ పాటలఁ బాడుచు
ముదమునఁ బుప్పొడుల మేనఁ బూఁతల నిడుచున్
ముదితలతో మధు వానుచు
మదమున మధుపానలీల మధుపము లందున్.

విదూ : (సమీపించి) వయస్యా! జయము జయము. ఆర్యురాలా! శుభము కలుగుగాక!

జీ.వా : మిత్రమా, ఆలసించితివేల?

విదూ : వయస్యా! పెందరకడనే బయలుదేరితిని, కాని, వివాహోత్సవ సంమిలితులగు సిద్ధవిద్యాధరుల యాపానోత్సవములఁ దిలకించుచు వచ్చుటచే నించుక నాలస్యమైనది. నీవు కూడఁ జూడుము.

జీ.వా : అటులే చేయుదును - (నలు మూలలఁ జూచి) మిత్రమా! చూడుము చూడుము.

తనువులఁ జందనం బలఁది దాల్చి యురంబులఁ గల్పమాలికల్
కనక విభూషణస్థమణి కాంతి విచిత్రిత వస్త్రులై ప్రియా
జన మొక యింత యానుచు నొసంగెడి యాసవమానుచుండ్రి చం
దన తరురాజి నీడల ముదంబున సిద్ధులు నస్మదాప్తులున్.

మనము కూడ తమాలవిటపివాటికిఁ జనుదము. (అందఱును నడతురు.)

విదూ : ఇదుగో తమాలవాటికఁ జేరితిమి. ఈమె వదనాంబుజము శారదాతప క్లాంతమై కన్పట్టుచున్నది. కావున నా స్ఫటికమణిశిలా ఫలకముపైఁ గూర్చుందుము.

జీ.వా : వయస్యా! బాగుగఁ జూచితివి. (మలయవతితో—)

క. విమల కపోల ప్రభలన్
గుముదాప్తున్ గెలిచె మోము కోమలి! యెండన్
కమలుట నెట్టిందనమున
కమలంబుల నిపుడు గెలువఁగడఁగెడు లీలన్.

(మలయవతీ హస్తముఁ గ్రహించి) ప్రేయసీ! కుసుమాకరోద్యాన దర్శనాభిలాషచే నిన్నూరక శ్రమపెట్టితిని. ఏలయన-

క. కలిత భ్రూవల్లికము
చలితాధర పల్లవంబు సంతాపహ మా
ఱెలి! నీ వదనమె నందన
మిల నటవీ మాత్రములు గదే యన్యంబుల్.

చేటి : (నవ్వుచు, విదూషకునితో) వింటివా, మా రాజకుమారి నెట్లు వర్ణించుచున్నాఁడో?

విదూ : చతురికా! అట్లు గర్వింపకుము, మాతో మాత్రము సౌందర్యవంతులు లేరనుకొంటివా? కాని, యసూయచే నెవ్వరు మమ్ములను వర్ణించుటలేదు.

చేటి : ఆర్యా! నిన్ను నే వర్ణింతునా?

విదూ : అమ్మయ్య! నేటికిఁ బ్రతికితిని. అమ్మా! నీవైన పుణ్యము కట్టుకొనుము. ఇటుపైనైన నీతడు "నీ విట్టివాడవు, అట్టివాడవు. కపిలమర్కటము వలె నున్నావు" అని యాక్షేపించకుండ నుండును.

చేటి : ఆర్యా! వివాహజాగరణదివసమునఁ గన్నులు మూసికొని కూర్చుండియె నిద్రపోవుచుండగా నీవు చాల అందముగ నున్నట్లు నా కగపడితివి. కావున, నా విధముగనే కూర్చుండుము. వర్ణించెదను. (విదూషకుఁ డా విధముగనే కూర్చుండును.)

చేటి : (తనలో) ఈతఁడు కండ్లు మూసికొని కూర్చుండి యుండగా నీలిమందు వలె నున్న నీ తమాలపల్లవరసము నీతని ముఖమునఁ బూయుదును. (లేచి తమాలపల్లవములనుఁ గోసి పిండును. మలయవతీ జీమూతవాహనులు చూచుచుందురు.)

జీ.వా.: వయస్యా! నీవు చాల ధన్యుఁడవు. మేమందఱ ముండ నీ వొక్కఁడవే వర్ణింపఁబడుచున్నావు. (చేటి తమాలరసము విదూషకుని ముఖమునఁ బూయును. మలయవతి జీమూతవాహనుని వైపు చూచి చిఱునవ్వు నవ్వును.)

జీ.వా.: (మలయవతీ ముఖముఁ జూచుచు.)

కం. చిఱునగ వను కుసుమము సుం
దరి! నీ కెమ్మోవి చిగురునన్ బొడతేఱన్
వరలెన్ దద్దర్శనఫల
మరయగ నా లోచన ద్వయంబున కిచటన్.

విదూ : చతురికా! ఏమి చేసితివి?

చేటి : వర్ణించితిని కదా!

విదూ : (చేతితో ముఖమునుఁ దుడుచుకొని చూచి కోపముతో, నొక దండకాష్ఠము నెత్తి) ఏమే దాస్యాః పుత్రి! ఇది రాజభవన మైపోయినది; లేకున్న నిన్నేమి చేసియుండెడివాఁడనో! (జీమూతవాహనునితో) చూచితివా? మీ యిరువురి యెదుటనే యీ దాస్యాః పుత్రి నన్నె ట్లవమానించినదో! నే నిచట నుండుట యెందులకు, మఱి యొక మూలకుఁ బోవుదును. (పోవును)

చేటి : నిజముగఁ గోపించినాఁడా యేమి? వీనిని బతిమాలెదను. (వెళ్ళబోవును.)

మల : సఖీ చతురికా! నన్నొంటరిగ విడచి పోవుచున్నావా?

చేటి : (జీమూతవాహనుని వైపు జూపుచు నవ్వి) చిరకాల మీ విధముగనే యొంటరిగ నుందువు గాక! (వెడలిపోవును)

జీ.వా.: (మలయవతీ ముఖముఁ జూచుచు—)

చం. దినకరుదీప్తిచే నరుణదీధితులొంది వికాసమొందు నా
ననమిది శుభ్రదంతకిరణద్యుతిఁ గేసర జాల శాలియై
గననగుచుండె వారిజ సగంధముగా నిఁకఁ దృష్ణ తీఱ నీ
యనితరలభ్యమౌ మధువు నానగ నీగదె యీ యళీంద్రునిన్.

(మలయవతి నవ్వుచు ముఖము నటు త్రిప్పును. జీమూతవాహనుఁడు మఱల నటులే చేయును; చేటి పటాక్షేపముచేఁ బ్రవేశించును.)

చేటి : (తొందరగా సమీపించి) ఆర్యమిత్రావసుఁ డెద్దియో కార్యవశమున నిన్నుఁ జూడ వచ్చి యున్నాఁడు.

జీ.వా.: ప్రేయసీ నీవింటికిఁ బొమ్ము. మిత్రావసునిఁ జూచి నేనును శీఘ్రముగనే వత్తును.

(మలయవతి చేటితోఁగూడ నిష్క్రమించును. మిత్రావసుడు ప్రవేశించును.)

మిత్రా :

తే.గీ. అకట! జీమూతవాహను నరుల నేనె
సమర రంగాన సమయింప కమితశక్తి
నే మొగముతోడఁ బల్కుదు లేమ వోలె
శత్రువశ మయ్యె నీదు రాజ్యం బటంచు.

ఏమైనను వానికిఁ దెలుపకుండఁగఁ బోవుట యుక్తము గాదు. కావున, వానికిఁ దెలియఁజేసియే యుద్ధమునకుఁ బోయెదను. (సమీపించును.)

జీ.వా.: (మిత్రావసునిఁ జూచి) మిత్రావసూ! ఇటఁ గూర్చుండుము. (మిత్రావసుఁడు గూర్చుండును.)

జీ.వా : (చూచి) మిత్రావసూ! వ్యాకులచిత్తుడవుఁ బోలె నున్నా వేమి?

మిత్రా : ఈ మాతంగహతకునిఁ గూర్చి వ్యాకులత యెందులకు?

జీ.వా : మాతంగుఁ డేమి చేసినాడు?

మిత్రా : అతఁడు నీ రాజ్య మాక్రమించి కొఱవితోఁ దల గోకికొనుచున్నాఁడు.

జీ.వా.: (సంతోషముతోఁ దనలో) ఇది నిజమై యుండునా!

మిత్రా : కావున వానిని నిర్మూలించుటకై నీ వాజ్ఞ యీయవలయును. వేయేల!

శా. సామర్థ్యోత్ప్లుతమౌ విమానతతి యాచ్ఛాదించి నల్దిక్కులన్
వ్యోమప్రాంగణసంచరద్రవికర వ్యూహంబులన్ గప్పుచున్
జీమూతౌఘము వోలె వాసరమునన్ జీకట్లు గొల్పంగ సం
గ్రామార్థం బిదె సిద్ధసంఘము చనన్ గాంక్షించు నీ యానలన్.

లేదా - సేనాసముదాయమెందులకు? (తన్నుఁ జూపుచు—)

తే.గీ. కీర్ణనిస్త్రింశ దీప్తాంశు కేసరాళి
యీ మృగేంద్రుఁడు విదిత సంగ్రామబలుఁడు
కదన రంగాన మాతంగ గంధహస్తి
నొడిసి పట్టెడు నొరు లేల యొక్కరుండు.

జీ.వా : (చెవులు మూసికొని, తనలో) ఆహా! ఎంత దారుణముగ మాటలాడు చున్నాఁడు! కానిమ్ము; ఇటులఁ జేయుదును. (ప్రకాశముగా) మిత్రావసూ! బాహుబలశాలి వగు నీకిదెంత పని? కాని—

తే.గీ. అమితకారుణ్య పూర్ణాంతరంగుఁ డెవఁడు
తనదు దేహమె యొరులకు దాన మొసగు
నాతఁ డెట్టుల రాజ్యార్థ మరివధంబు
క్రూరతన్ జేయ నొడిగట్టు వీర! చెపుమ.

ఇంతియేఁగాక, నా దృష్టిలోఁ బంచక్లేశములు దక్క శత్రువు లనువారు లేరు. కావున నస్మత్ప్రియకరణాభిలాషివే యైనచోఁ గ్లేశవశీకృతుఁడగు నీ శోచనీయాత్మునిఁ దయఁ జూడుము.

మిత్రా : (కోపముతో నవ్వుచు) మన కుపకారి యగు నీ కృతఘ్నుని దయఁ జూడ కుండు టెట్లు?

జీ.వా. : (తనలో) నూతన కోపావేశ భరిత చిత్తుఁ డగు వీని మరలింప శక్యము గాదు. ఇట్లు చేసెదను. (ప్రకాశముగా) మిత్రావసూ! లెమ్ము; లోనికి

బోవుదము. నీ కచటనే బోధింతును సాయంకాల మగుచున్నది. చూడుము.

శా. నిద్రా ముద్రిత పద్మకోశ తతులన్ లేవన్ ద్విరేఫావళుల్
భద్రంబౌ స్వకరౌఘముల్ నలుదిశల్ వ్యాపింప నామోదస
న్ముద్రం గప్పి జగాల సర్వదివిజుల్ మూర్ధానతిన్ జూడ న
స్తాద్రిం జేరియు నన్యలాభరతుఁడీ యర్కుఁండె సంస్తుత్యుడౌ.

(ఎల్లరు నిష్క్రమింతురు.)

ఇది **తృతీయాంకము.**

శ్రీః

## చతుర్థాంకము

(రక్త వస్త్రద్వయముతోఁ గంచుకియుఁ బ్రతీహారియుఁ బ్రవేశింతురు.)

కంచుకి : (వార్ధక క్లేశము నభినయించుచు—)

కం. అంతఃపుర వ్యవస్థల
సంతతము న్నిలిపి తొలఁగ స్ఖలితము లెల్లన్
వింత యగు దండనీతి ని
రంతరమై యొప్ప నుంటి రాజానుకృతిన్.

ప్రతీహారి : ఆర్యా, వసుభద్రా! నీ వెచటకు బయలుదేరితివి?

కంచు : యువరాజ మిత్రావసుని జనని యగు మహాదేవి "కంచుకీ! పదిరోజుల వఱకు మలయవతికి నల్లునకును రక్తవస్త్రములఁ దీసికొని వెళ్ళవలయును" అని యాజ్ఞాపించినది. రాజకుమారి మలయవతియు నత్తవారి యింటనే యున్నది. జీమూత వాహనుఁడు మిత్రావసునితోఁ గూడ సముద్ర తీర దర్శనార్థ మిపుడే యేగె నని వింటిని. ఇపుడు రాజకుమారి యొద్దకుఁ బోవలయునో యల్లునివద్దకుఁ బోవలయునో తెలియజాలకున్నాఁడ.

ప్రతీ : ఆర్యా! రాజకుమారి యొద్దకు వెళ్ళుటయే మంచిది. అల్లుఁడు గూడ నిప్పటికి వచ్చియే యుండును.

కంచు: సునందా! నీవు చెప్పినది బాగుగ నున్నది. నీ వెటకు బయలుదేరితివి?

ప్రతీ : మహారాజ విశ్వావసువు "సునందా! నీవు పోయి కుమార మిత్రావసునితో నీ దీప ప్రతిపదుత్సవ సందర్భమున మలయవతికిని నల్లునకు నుత్సవో చిత మగుఁ బారితోషిక మెద్దియైన నీయవలయును; గాన, నీవు వచ్చి తగు ఏర్పాట్లు చేయుము" అని నా మాటగఁ జెప్పు మని యాజ్ఞాపించి యున్నాఁడు. మీరు రాజకుమారి యొద్దకుఁ బొండు; నేనును యువరాజ మిత్రావసునిఁ దోడ్కొనివత్తును.

(ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది విష్కంభకము.

(అంతట జీమూతవాహన మిత్రావసువులు ప్రవేశింతురు.)

జీ.వా.

తరుమూలంబు గృహంబు శాద్వల మగున్ దల్పంబు లేడుల్ సఖుల్
ఝురనీరం బిట పేయ మాసనవిధాశాలుల్ శిలల్ కందముల్
వరభోజ్యంబు లయాచితాప్తవివిధైశ్వర్యంబులౌఁ గానలన్
పరలాభాచరణాసమర్థుఁడ నిదే వర్ణింప లోపం బిటన్.

మిత్రా : (పైకి చూచి) కుమారా! త్వరపడుము త్వరపడుము సాగరము చలించు సమయ మిది.

జీ.వా : (విని) బాగుగఁ జూచితివి.

చ॥ వరజలకుంజరేంద్ర కరభ ధ్వని నొంది చతుర్గుణత్వమున్
గురుగిరి కందరోదర విఘూర్ణితమై ప్రతి శబ్దతారమై
యురుతరనిస్స్వనం బిది మహోద్ధతమై వినవచ్చెఁ జూడ నీ
తరల తరంగ రింఖదమితస్ఫుట శంఖము వార్ధి పొంగెడున్.

మిత్రా : ఇదిదో, వచ్చి వేసినది చూడుము.

కం. కవలితలవంగ పల్లవ
లవకరిమకరౌఘముక్త లలితోద్గార
ప్రవరామోదోదక మతి
జవనంబౌ వార్ధి రత్నచయమున నొప్పున్.

కావున రమ్ము. ఈ జలప్రవాసారమార్గమునుండి తప్పించుకొని, పర్వత సాను సమీపమార్గమునఁ బోవుదము.

జీ.వా : (నడచి చూచుచు) మిత్రావసూ! చూచితివా యీ మలయాచలసాను ప్రదేశములు శారదాభ్రపటల ప్రావృతములై హిమాచల సానువుల వలె నొప్పుచున్నవి.

మిత్రా: కుమారా! యివి మలయాచలసానువులు గావు, నాగుల యస్థి కూటములు.

జీ.వా : (ఆవేగముతో) అకటా! వీటి కిటు లేల సంఘమరణము సంభవించెనో గదా?

మిత్రా : కుమారా! ఇవి సంఘమరణము నంది యుండలేదు. వినుము చెప్పెదను. పూర్వము వైనతేయుఁడు ప్రతిదివసమునను స్వపక్షతివవనములచే సాగరోదకముల నెగురఁగొట్టి రసాతల నివాసు లగు భుజంగములఁ బలాత్కారముగఁ జంపి తినుచుండెడివాఁడట.

జీ.వా : అకటా! ఈతఁడెంతటి దుష్కార్యమున కొడిఁగట్టినాడు! తరువాత?

మిత్రా : అంత నాగరా జగు వాసుకి రసాతలనివాసు లెల్లరు నశింతురను భయముచే గరుత్మంతునితో నిట్టు లనెను.

జీ.వా : (సాదరముగ) ముందుగ నన్ను భక్షింపు మనియా?

మిత్రా : కాదు కాదు.

జీ.వా : కాక మరేమని?

మిత్రా : "వైనతేయా! త్వదాపాతసంత్రాసముచే వేలకొలది నాగాంగనలకు గర్భస్రావ మగుచున్నది. నాగశిశువులు మరణించుచున్నారు. ఇటుల క్రమక్రమముగ మా సంతతి విచ్ఛిన్న మగుచున్నది. దీనిచేఁ గాలక్రమమున నీకును స్వార్థహాని సంభవించును. నీవు భుజంగంబులఁ బట్టుటకే కదా నాగలోకమునకు వచ్చుచున్నావు. కాన ప్రతిదినంబున నొక్కొక నాగుని నీవు సముద్రతీరమున నుండఁగనే నీయొద్దకుఁ బంపెదను."

జీ.వా : ఎంత కష్ట మెంత కష్టము? నాగరాజు పన్నగముల నిటులా రక్షించుట?

తే.గీ. అహుల రక్షింప నీ దేహ మహివిరోధి
కిత్తు నీహిత మీడేర నిత్తు ననుచు

రెండు వేలగు నాలుక లుండ నొక్క-
టైనఁ బల్కఁదె యక్కటా! యహికులేశ!
తరవాత?

మిత్రా : తార్క్ష్యుఁడు నందుల కంగీకరించెను.

తే.గీ. వైనతేయుడు పంతాన వంతు వేసి
యిటుల సర్పాలఁ జంపగఁ జటులవృత్తి
యస్థికూటంబు తుహిన శైలాభ మగుచుఁ
బెరిగెఁ బెరుఁగుచు నున్నది బెరుఁగు నకట.

జీ.వా : (ఆశ్చర్యముతో)

తే.గీ. సర్వదోషైకసదనంబు గర్వభూమి
నాశశీలంబు నకృతజ్ఞ మీ శరీర
మౌర! దీనినిఁ బోషింప ఘోరపాప
ములకు నొడిగట్టుచుందురు మూఢు లకట!
పాప మీ నాగ కులమున కప్రతీకార మగు నావద సంభవించినది!
(తనలో) నా శరీరము నిచ్చి యొక్క నాగుని ప్రాణము నైన రక్షింపఁ
గల్గుదునా?

(ప్రతీహారి ప్రవేశించును.)

ప్రతీ : గిరిశిఖర మధిరోహించితిని. మిత్రావసువును వెదకెదను. (నడచి)
ఇదుగో, మిత్రావసుఁ డల్లునితోఁగూడ నిచ్చటనే యున్నాఁడు. (సమీ
పించి, నమస్కరించి) కుమారులారా! జయము జయము.

మిత్రా : సునందా! ఇట నెందులకు వచ్చితివి?

(ప్రతీహారి చెవిలోఁ జెప్పును)

మిత్రా : కుమారా! తండ్రిగారు నన్నుఁ బిలుచుచున్నారు.

జీ.వా : వెళ్లుము.

మిత్రా : సులభాపాయ మగు నీ ప్రదేశమున నీవైనఁ గుతూహలముతోఁ జాల
సేపటివఱకు నుండుట మంచి పని గాదు. నీవు కూడ శీఘ్రముగ రమ్ము.
(ప్రతీహారితో నిష్క్రమించును.)

జీ.వా : ఈ గిరిశిఖరము దిగి సముద్రతీరము నవలోకింతును. (నడచును.) (తెరలో) హాపుత్రా! శంఖచూడా! నేఁడు నీ బలాన్మరణముఁ జూడవలసి వచ్చినది కదా!

జీ.వా : ఏమిది! యాఁడుదాని యేడ్పువలె నున్నదే? ఈమెను సమీపించి యీామె యెవ్వతెయో, భయకారణ మెద్దియో తెలిసికొందును. (నడచును. తల్లి యేడ్చుచు వెనువెంట వచ్చుచుండ శంఖచూడుడును, గుప్త మగు వస్త్ర ద్వయముతో గింకరులును బ్రవేశింతురు.)

వృద్ధ : హా పుత్రా! శంఖచూడా! నేడు నిన్నుఁ జంపుచుండఁ జూడవలసి వచ్చి నది గదా! (గడ్డముఁ బట్టి) ఈ ముఖచంద్రుఁ డస్తమించినచోఁ బాతాళ లోకము నా హృదయము గూడ నంధకార బంధుర మగును గదా!

శంఖ : అమ్మా! ఈ విధముగ నెక్కువగ బాధపడుచు నన్నింకను నేలఁ బీడింతువు?

వృద్ధ : (చాలసేపు చూచి, యవయవములను స్పృశింపుచు) హా పుత్రా! సూర్య కరాస్పృష్టచర మగు నీ సుకుమారగాత్రమునుఁ గరుణా విహీన హృదయుఁడగు వైనతేయుఁడు భక్షించును గదా! (కంఠమున గ్రహించి బిగ్గరగ నేడ్చును.)

శంఖ : అమ్మా! విచారింపకుము, చూడుము.

తే.గీ. జన్మ మందిన వెంటనె జంతుజాల
మొందు నస్థిరతాశ్లేష మంది పిదపఁ
దల్లిఁ జేరునుఁ బెంపుడు తల్లి వోలె
లోకరీతులఁ దెలిసియు శోక మేల?

(వెళ్ళుటకుఁ బ్రయత్నించును.)

వృద్ధ : పుత్రా! క్షణకాల మాగుము, నీ ముఖము నింకొక సారి చూతును.

కింకరుఁడు : (ఆక్షేప పూర్వకముగ) రమ్ము శంఖచూడా! రమ్ము. నీ తల్లి యట్లు చెప్పుచునే యుండును. పుత్ర స్నేహమున రాజకార్య ప్రాధా న్యము నెఱుఁగఁ జాల కున్నది.

శంఖ : ఇదిగో, వచ్చుచున్నాను.

కింక : (తనలో) వీనిని వధ్యశిలా సమీపమునకుఁ దీసికొని వచ్చితిని. కావున నీ వధ్య చిహ్న మగు వస్త్రద్వయము నిచ్చి వ్యధశిలఁ జూపుదును.

జీ.వా : (చూచి) ఆ యేడ్చుచున్న యాడు దీమెయే. (శంఖచూడునిఁ జూచి) ఈ తఁ డీమె కుమారుఁడై యుండవలయును. వీని కొఱకే కాబోలు నీమె యేడ్చుచున్నది. (నలుమూలలఁ జూచి) ఇచట నేమియు భయ కారణము కానరాకున్నదే, ఈమె యేల భయపడుచున్నది? కానిమ్ము. వీర లెద్దియో మాటలాడికొనుచున్నారు. దీని నుండి తెలిసికొనవచ్చును. కొమ్మల మాటున దాగి వినెదను. (అటులఁ జేయును.)

కింక : (కన్నీటితో దోసిలి పట్టి) కుమారా! శంఖచూడా! రాజాజ్ఞానుసారముగా నీ కఠినవాక్యములఁ జెప్పవలసియున్నది.

శంఖ : భద్రముఖా! చెప్పుము.

కింక : నాగలోకాధిపతియగు వాసుకి నిన్నాజ్ఞాపించుచున్నాఁడు.

శంఖ : (తలపై దోసిలి యొగ్గి) ప్రభువు లేమని యాజ్ఞాపించుచున్నారు?

కింక : ఈ రక్తాంశుక యుగమును ధరించి వధ్యశిల నధిరోహింపుము. వీనిచే నిన్ను గుర్తించి వైనతేయుఁడు భక్షించును.

జీ.వా : అకటా! ఈతఁడు వాసుకి పరిత్యక్తుఁడై గరుత్మంతున కాహార మగుచున్నాఁడా?

కింక : శంఖచూఁడా! దీనిని గ్రహింపుము. (వస్త్రద్వయ మిచ్చును.)

శంఖ : (సాదరముగా) ఇటు లిమ్ము. (గ్రహించి) స్వామ్యాదేశమును శిరసా స్వీకరించితిని.

వృద్ధ : (పుత్రుని హస్తమున వస్త్రములఁ జూచి గుండెలు బాదికొనుచు) హా! కుమారా! ఇది పిడుగుపాటువలె నున్నది. (మూర్ఛిల్లును).

కింక : గరుడాగమన సమయము సమీపించుచున్నది. నేను తొందరగబోవుదును. (వెడలిపోవును)

శంఖ : అమ్మా! ఊరడిల్లు మూరడిల్లుము.

వృద్ధ : (ఊరడిల్లి, కన్నీటితో) హా పుత్రా! హా వత్సా! హా మనోరథ శత సంప్రాప్తా! హా మాతృభక్తా! హా వినీతాగ్రేసరా! పూర్ణేందు సదృశ మగు నీ ముఖము మఱల నెట్లు చూడగలను? (కంఠమును గ్రహించి యేడ్చును)

జీ.వా : ఔరా! గరుత్మంతుఁడు ఎంతటి దయాహీనుఁడు!

శా. దీనాలాపము హృద్విదారణవిధాతీవ్రత్వముం జెంద న
స్రానూనప్రసరాప్లుతోక్తి "నెవరున్ హా; కావరే నా సుతున్,
రానే రారటె!" యంచు నేడ్చు జననిన్ రక్షింప కేతత్సుతున్
వీనిన్ ద్రుంప ఖగేంద్రుచంచు వటు లౌనే స్వాంతమున్ వజ్రమై?

శంఖ : (దుఃఖావేగముచేఁ దల్లి హృదయము బ్రద్దలగు నను శంకతో) అమ్మా!
ఏడ్చి యేమి ప్రయోజనము?

మ. తమి నెవ్వేళల యాచకేష్టము నవంధ్యంబౌ నటుల్ సేయువా
రమింతంబౌ దయతోఁ బరార్థములనిస్వార్థేచ్ఛులై కూర్చువా
రమరాత్ముల్ పరదుఃఖ దుఃఖితులు లేరమ్మా! ఇలన్ నేడిఁకన్
శ్రమలన్ సైపక యేడ్వ నేమి ఫలమౌ? చాలింపు మీ దుఃఖమున్.

(చేతితోఁ దల్లికన్నీటినిఁ దుడుచును.) అమ్మా! ఊరడిల్లు మూరడిల్లుము.

వృద్ధ : (కన్నీటితో) పుత్రా! ఎట్లూరడిల్లుదును. నా యేకైకపుత్రుఁడ వని యాలో
చించి యైన నాగరా జగు వాసుకి నిన్ను రక్షింపలేదు కదా? ఓయీ!
యమధర్మరాజా! ప్రపంచ మంతయు సుఖముగ నుండ దయావిహీనుఁడ
వగు నీవు నా కుమారుని మాత్రమే మరువఁ జాలకపోతివా? సర్వథా
నేను దురదృష్టవంతురాలను.

జీ.వా : (కరుణతో)

తే.గీ. బంధుజాలంబు నిర్దయత్వమున విడువ
భీరు దుఃఖార్తు నాసన్న ఘోరమృత్యు
బాలు వీనిని రక్షింపఁజాల నేని
దేహ మిది యేల నా జీవితేహ యేల?

కావున సమీపింతును.

శంఖ : అమ్మా! ధైర్య మవలంబింపుము.

వృద్ధ : హా పుత్రా! నాగలోకపాలకుఁ డగు వాసుకియే నిన్నుఁ బరిత్యజింప
నింకెవ్వరు రక్షింపగలరు - నే నూరడిల్లుటకు?

జీ.వా : (శీఘ్రముగ సమీపించి) ఇదుగో నేను!

వృద్ధ : (గరుడ భ్రాంతిచే ససంభ్రమముగ నుత్తరీయముచేఁ గుమారునిఁ గప్పుచు నాయకుని సమీపించి) వైనతేయా! నన్ను భక్షింపుము. నాగరాజు నన్నే నీ కాహారముగఁ బంపి యున్నాఁడు.

జీ.వా : (కన్నీటితో) ఆహా! ఏమి పుత్రవాత్సల్యము?

తే.గీ. పుత్రవాత్సల్య సంభూత భూరి శోక
వికలమానస నీనాగవృద్ధఁ గాంచి
కఠినచిత్తుఁడు తార్క్ష్యుండె కరుణఁ గాంచు
నన్య మింతటి దుఃఖావహంబు గలదె?

శంఖ : అమ్మా! భయపడకుము. ఈతడు నాగశత్రువు కాదు. చూడుము.

కం. గురు తర ఫణి మస్తిష్క
క్షర దురురక్త చ్ఛటాంశు చర్చిత చంచుం
డురగారి యేడ? నీతఁడు
వరసుకుమారాంగుఁ డేడ పరికింపగదే!

వృద్ధ : పుత్రా! నీ మరణభీతిచే నా కంతయు గరుడమయముగఁ గన్పట్టుచున్నది.

జీ.వా : తల్లి! భయపడకుము. నేను విద్యాధరుఁడను. నీ పుత్రుని రక్షించుటకే వచ్చితిని. ధైర్యము వహింపుము.

వృద్ధ : (సంతోషముతో) నాయనా! ఈ మాటలను మఱల నొకమాఱు చెప్పుము.

జీ.వా : మఱల నోటితోఁ జెప్పనేల? కార్యముననేఁ జూపింతును.

వృద్ధ : (తలపై దోసిలి పట్టి) నాయనా! "దీర్ఘాయుష్మాన్ భవ."

జీ.వా :

తే.గీ. ఈతనిన్వేగ రక్షింప నీయవమ్మ
వధ్యచిహ్నంబు తల్లి యీ వస్త్రయుగము
దీని దాలిచి సంప్రీత్యుదీర్ణ వృత్తి
వైనతేయుని కాహార మేన యగుదు.

వృద్ధ : (చెవులు మూసికొని) శివశివా! వత్సా! నాకు నీవును శంఖచూడుని వంటి కుమారుఁడవే. కాదు కాదు - స్వజనపరిత్యక్తుఁడగు వీనిని రక్షింప శరీర పరిత్యాగమునకుఁ గూడ సన్నద్ధుఁడ వగు నీవు శంఖచూడునికంటె గూడ నా కెక్కుడవాఁడవు.

శంఖ : (విచారముతో) ఆహా! ఈ మహాత్ముని హృదయము లోకవిరుద్ధముగ నున్నది. ఏలయన—

మ. మును గాధేయుఁడు వేనికై శ్వపిశితంబున్ మ్రింగెఁ జండాలు మా
డ్కినిఁ గ్రూరుండయి గౌతముండు తినె నాడీజంఘునిన్ వేనికైఁ
గన నిత్యం బిటఁ గాశ్యపుండు తినునో కాలాహుల న్వేనికై
ఘనుఁ డీతండు పరిత్యజించుఁ దృణముల్ గా నట్టి ప్రాణంబులన్.

(జీమూతవాహనునితో) ఓ మహాత్మా! ప్రాణములఁ గూడ నీయ సమకట్టి నీ వవ్యాజ మగు కరుణ జూపితివి. నన్నిక నిర్బంధింపవలదు. చూడుము-

తే.గీ. పుట్టుచుందురు మాదృశుల్ గిట్టుచుందు
రార్య! క్షుద్రులు వీ రెటులైన నేమి?
పరులకై బద్ధదీక్షులు కరుణ మీర
ధరణిపై త్వాదృశుల్ బుట్టు టరుదు గాదె?

ఏల నిర్బంధింతువు? ఈ ప్రయత్నము విడువుము.

జీ.వా : (శంఖచూడుని హస్తమున గ్రహించి) కుమారా, శంఖచూడా! చిరకాల సంప్రాప్త మగు పరోపకారసంపాదనావసరమున కంతరాయముఁ గల్పింపకుము. సందేహింపకుము. ఈ వధ్యచిహ్నము నా కిమ్ము.

శంఖ : సాహసికాగ్రణి యగు నో మహాత్మా! వ్యర్థముగ నేల శ్రమపడెదవు? శంఖనిర్మల మగు నీ శంఖపాలకుల యశము నీ శంఖచూడుడు మలినముఁ జేయఁజాలడు. నీకు మాయెడల దయ యున్నచో దుఃఖవ్యాకులిత చిత్త యగు మా జనని ప్రాణములు విడువకుండ నుపాయముఁ జూడుము.

జీ.వా : చూచుట కేమున్నది? ఇదివఱకే చూచి యుంచితిని. ఆ యుపాయసిద్ధి నీపై నాధారపడి యున్నది.

శంఖ : ఏమది?

జీ.వా :

తే.గీ. ఈవు జీవింప జీవించు నెవతె ప్రీతి
నసువులన్నీవు పాసినఁ బాయఁదలఁచు
నట్టి తల్లినిఁ గావఁ దలంతువేని
నాదు ప్రాణాల నీ దేహ మాదుకొనుము.

ఇదియే యుపాయము. వధ్యచిహ్న మిటు దెమ్ము. దీనిఁ గప్పుకొని వధ్యశిల నధిరోహింతును. జననీసహితుఁడవై నీవు మఱలి పొమ్ము. వధ్య స్థానముఁ జూడగనే నీమె యబలాజనసహజ మగు భీరుభావముచే నసు వులఁ బాయవచ్చును. హతభుజంగ కంకాల సంకుల మగు నీ భయంకర శ్మశానముఁ జూచుట లేదా? ఇదిగో—

మ. చల చంచ్వగ్ర నికృన్త నాస్త పిశితాస్వాదాతిలోభాతురా
కుల గృధ్రాహత పక్షజాల విసరద్ఘోరాంధకారావృత
స్థల మిచ్చో శమితాగ్ని దీపిత శిఖాస్రంసద్వసా పంకిలా
విలర క్తంబున ఘోరఫేరవతతుల్ భీష్మధ్వనిన్ చేసెడిన్.

శంఖ : చూడకేమి?

ప్రతిదినంబున నహిహారభాజనంబు
కృత వినాయక సంప్రీతి వితతభూతి
శశిసితాస్థి కపాలాది సంకులంబు
రుద్రదేహంబు వలె నొప్పు రౌద్రభూమి.

కావున నీవు పొమ్ము. ఈ సామవాక్యముల నేమి ప్రయోజనము? గరుడా గమన వేళ సమీపించుచున్నది. (తల్లి యెదుట ముంగాళ్ళపై నిలువబడి శిరముపై దోసిలి నిడి) అమ్మా! ఇఁక నీవు గూడ మఱలి పొమ్ము.

కం. ఏయే జన్మము లెత్తిన
నా యా జన్మప్రవాహమందు జననివై
మాయమ్మ! గనుచు నన్నుం
బాయక రక్షింపు మనుచుఁ బ్రార్థింతు నిదే!

వృద్ధ : (కన్నీటితో) అకటా! ఇదియేనా పీని యంతిమవాక్యము? పుత్రా! నిన్ను విడచి నా పాదములు ముందునకు సాగుట లేదు. నేనును నీ తోడనే మరణింతును.

శంఖ : (లేచి) ఇట కుత్తరమున నున్న భగవంతుఁ డగు దక్షిణగోకర్ణక్షేత్రాధీశు నర్చించి రాజాజ్ఞ నిర్వర్తింతును. (తల్లితో నిష్క్రమించును.)

జీ.వా : నా యభిలాష తీరినది. ఇపు డేమి యుపాయము?

(అంత వస్త్రముతోఁ గంచుకి ప్రవేశించును.)

కంచు : మిత్రావసుజనని యగు మహాదేవి కుమారున కీ రక్తాంశుక యుగళ మంపినది. కావున వీనిని ధరింపుము.

జీ.వా : (చూచి, సంతోషముతో తనలో) అతర్కితోపనత మగు నీ రక్తాంశుక ద్వయముచే నా యభిలషిత మీడేరినది. (ప్రకాశముగా) కంచుకీ! యిటు తెమ్ము. (కంచుకి యిచ్చును.)

జీ.వా : (వానిని ధరించి, తనలో) నా మలయవతీ పరిణయము నేఁడు సఫల మైనది. (ప్రకాశముగా) కంచుకీ! నీవు పొమ్ము. మహాదేవికి నా నమస్కృతుల నందఁజేయుము.

కంచు : అటులే చేయుదును. (నిష్క్రమించును.)

జీ.వా :

తే.గీ. రక్తవాసోయుగం బిది యుక్తకాల
మందు లభియించె నాకు నానంద మొదవ
పరహితంబునుఁ గూర్పంగ వలయు నాకు
ఇది యహా! దివ్యశకునమై మొదటఁ గలిగె.

(దిశలఁ బరికించి) మలయాచల శిలాచయ సంచాలక మగు నీ ప్రచండ మారుతముఁ జూడ విహగాధిపుఁడు వచ్చుచున్నట్లున్నది. ఇదిగో - ఈతడు-

మ. ఘనసంవర్తమహాభ్రరీతి గగనాక్రాంతిన్ గనన్ బక్షతుల్
తను వేగోద్ధత వాతధూత జలధుల్ ధాత్రీతటిన్ గప్ప; ను
క్కునఁ గల్పాంతవిశంక దద్దఱిలి దిక్కుంభీంద్రముల్ జూడ న
స్వన సౌవర్ణ పతత్రకాంతి దిశలన్ బర్వన్ ద్వరన్ వచ్చెడున్.

కావున నీ శంఖచూడుఁడు వచ్చు లోపుగా శీఘ్రముగ నీ వధ్యశిల నధిరోహించెదను (అటులఁ జేసి, సుఖస్పర్శము నభినయించుచు.) ఆహో! దీని స్పర్శ మెంత సుఖకరముగ నున్నది!

తే.గీ. వాంఛితార్థంబు సాధించు వధ్యభూమి
చారు సంస్పర్శమిచ్చు నపారసుఖము
మలయచందన పంకార్ద్రమలయవతియు
స్వీయ పరిరంభణ క్రియ నీయగలదె?

మలయవతి మాట యేల?

తే.గీ. శైశవంబునఁ దల్లి యుత్సంగ సీమ
రాగమునఁ జేరి కన్న విశ్రాంతి పూర్ణ
సుఖమునే చూఱఁగొంటిని జూడ నేఁడు
వధ్యభూమ్యంక సంశ్లేషవిధ్యవాప్తి.

ఇదిగో, గరుత్మంతుఁడు వచ్చుచున్నాఁడు. శరీరముఁ గప్పకొని నిలబడెదను. (అటులే చేయును.)

(గరుత్మంతుఁడు ప్రవేశించును.)

మ. శశిబింబంబు విభీతి సంచల దహీశానాంగమై తోపగన్
వశముం దప్పి రథాశ్వముల్ రవి చలింపన్ భ్రాత హర్షింపగాన్
విశదాభ్రంబులు ప్రక్కఁ జేరుట వడిన్ విస్తారిపక్షాళి న
హ్యశనార్థం బిట మాల్యవంతమున కాహారార్థమై వచ్చితిన్.

జీ.వా : సంతోషముతో)

తే.గీ. నాదు దేహము విడనాడి నాగరక్షఁ
జేయ నే పుణ్యలేశంబు సిద్ధమగునో
యదియ యాగామిజన్మసహస్రమందు
నొరులకై నాకు దేహంబు నొసగుగాక!

గరు : (జీమూతవాహనునిఁ జూచి)

మ. వ్యథితున్ వధ్యశిలాతలాంతపతితున్ స్వజ్ఞాతిరక్షామతిన్
పృథు మద్భీతి విదీర్య మాణ హృదయావిర్భూత రక్తచ్ఛటా
త్యధిలేపాయిత ఘోరరక్త వసనాంతాచ్ఛాదితున్ వీని న
శ్లథ చంచూపుట వజ్రవేధఁ దనువెల్లన్ వ్రీలగాఁ జంపుదున్.

(నాయకు నాక్రమించి పట్టుకొనును.)

(తెరలో దుందుభి ధ్వనియుఁ బుష్ప వృష్టియు.)

గరు : (ఆశ్చర్యముగా) అరే, దుందుభి ధ్వనియుఁ బుష్ప వృష్టియు! (పైకి చూచి, విని.)

శా. ఆమోదానుసరద్ద్విరేఫగణపుష్పాసారముల్ జాఱ స్వ
ర్ధామంబందున మ్రోగె దుందుభితతుల్ తత్కారణం బెద్దియో?
(నవ్వి.)
యీ మందారము తీవ్ర పక్షపవనాత్యాకంపితంబయ్యెన
శ్రామంబున్ లయశంక గర్జిలు నిదే సాంవర్తకాభ్రౌఘముల్.

జీవా : (తనలో) అదృష్టవశమునఁ గృతార్థుఁడనైతిని.

గరు : (నాయకునిఁ గబళించుచు)

తే.గీ. భోగిసంరక్షణార్థియౌ నాగుఁ డితఁడు
బరువుగన్ఁ దోఁచు గురుదేహవంతుఁ డౌట
ఖున్నివారణ మౌ నేఁడు సులభరీతి
సర్పభక్షణవాంఛయు శాంతి నొంద.

కావున వీనిని గ్రహించి మలయపర్వతము నెక్కి భుజింతును. (జీమూత వాహను నోటఁ గఱచి తీసికొనిపోను.)

ఇది చతుర్థాంకము.

శ్రీః

# పంచమాంకము

(ప్రతీహారి ప్రవేశించును.)

ప్రతీ :

తే.గీ. ఉప వనంబులనే యుండ విపదలెల్లఁ
ప్రేమ శంకించుచుండు నీ భూమి నెపుడు
భీకరారణ్యమధ్య నేకాకి బంధు
వుండ మానస శంకలు మెండు కావె?

సాగర వేలావలోకనార్థమై వెడలిన జీమూతవాహనుఁ డాలసించుచున్నాడని మహారాజ విశ్వావసువు విచారించుచు, "సునందా! యల్లుఁడగు జీమూతవాహనుఁడు వైనతేయాక్రాంత మగు స్థానమున కరిగె నని వింటిని. అప్పటి నుండియు నా మానసము శంకాకులమై యున్నది. శీఘ్రముగఁ బోయి యాతఁడు గృహముఁ జేరెనో లేదో తెలిసికొని రమ్ము" అని నన్నాజ్ఞాపించినాడు. అటకే బోయెదను. (నడచి యెదుటఁ జూచి) ఇదే జీమూతవాహనుని జనకుఁ డగు రాజర్షి జీమూతకేతుఁడు సహధర్మచారిణియు, కోడలగు రాజకుమారియు సేవించుచుండ నుటజ ప్రాంగణమున నాసీనుడై యున్నాఁడు.

శా. క్షౌమద్వంద్వము ఫేన శుభ్రము దరంగస్పంది దాఁ దాల్చుచున్
భామారత్నము రాజ్ఞి జాహ్నవి వలెన్ బార్శ్వంబునన్ గొల్వఁగా
సామీప్యంబున వేల యోచుఁ బరగన్ సాధుస్నుషా రత్నమున్
శ్రీమత్త్వంబున నొప్పుఁ దోయధి వలెన్ జీమూతకేతుం డిటన్.

వీరిని సమీపింతును.

(పత్నీ వధూసమేతుఁడై యాసనోపవిష్టు డగు జీమూతకేతువు ప్రవేశించును.)

జీ.కే :

ఉ. యౌవన భోగ్య సౌఖ్యముల నందితిఁ గీర్తుల విస్తరించితిన్
భావిత రాజ్య మేలితిఁ దపం బొనరించితి శాంతచిత్తతన్
బావనుఁ బుత్రుఁ గాంచితిని భవ్యకులోద్భవ నందితిన్ స్ను
జీవిత సార్థకత్వ మిదె చెందితి వేచెద నింక మిత్తికై. షన్

ప్రతీ : (తొందరగా వచ్చి) జీమూతవాహనుని...........

జీ కే : (చెవులు మూసికొని) పాపము శమించుగాక! పాపము శమించుగాక!

వృద్ధ : అమంగళము ప్రతిహత మగుగాక!

మల : (తనలో) ఈ యపశకునముచే నా హృదయము కంపించుచున్నది.

జీ.కే : భద్రా! జీమూతవాహనున కేమి?

ప్రతీ : జీమూతవాహనుని వార్తఁ దెలిసికొనుటకై నన్ను మహారాజ విశ్వావసువు మీ యొద్దకుఁ బంపినాఁడు.

జీ.కే : కుమారుఁ డచట లేఁడా?

ప్రతీ : లేఁడు.

వృద్ధ : (విచారముతో) మహారాజా! నా పుత్రుకుఁ డట లేనిచో నెచటకుఁ బోయి యుండును?

జీ కే.: మన కాహారమును సంపాదించుటకై చాల దూర మేగి యుండును.

మల : (దుఃఖముతోఁ దనలో) ఆర్యపుత్రునిఁ జూడకపోవుటచే నేలనో నా హృదయము పాపమును శంకించుచున్నది.

ప్రతీ : మహారాజా! ఆజ్ఞాపింపుము, ప్రభువు కేమని విన్నవింతును?

జీ.కే : (ఎడమకన్నదరుటను సూచించుచు) జీమూతవాహనుఁ డాలసించుటచే హృదయ మెంత వ్యాకులతఁ జెందుచున్నది!

తే.గీ. మాటిమాటికి నశుభంపు మాటఁ దెలుప
వామనయనంబ! యదిరెద వేమికతన?
వేగఁ బుత్రుడు కుశలియై వెడలివచ్చు
చాలు చాలును నీ వృథాస్పందనంబు.

(పైకిఁ జూచుచు) భువనైక నేత్ర భూతుఁ డగు సహస్ర మరీచి మాలియే కుమారునికిఁ దప్పక శ్రేయముఁ గూర్చును. (చూచి, యాశ్చర్యముతో)

ఉ. దారుణ రక్తరంజన నితాంత హృదంతర భీతికారణో
ద్దారుణకాంతిజాలముల నక్షిసుదుస్సహరీతులన్ యుగాం
తేరిత లోకఘస్మర సమీరణపాతిత తారకాభలన్
జారుచునున్న దెద్దియొ విశాలనభస్థలినుండి యిచ్చటన్.

ఏమీ! నా పాదముపైఁ బడినదే?

(అందఱు నాశ్చర్యముతోఁ జూచుచుందురు.)

జీ.కే : ఏమీ! సరస మాంసానులిప్త మగు చూడామణియా యిది? ఎవరిదై యుండును?

వృద్ధ: (దుఃఖముతో) మహారాజా! యీ చూడామణి కుమారునిదే.

మల : (తనలో) అటు లనకుము.

ప్రతీ : మహారాజా! వాస్తము నెఱుఁగకయే యీ విధముగ వైక్లబ్యమునుఁ జెందకుము. వైనతేయుడు భక్షింపఁ దన్నఖముఖోత్ఖాతములగు ననేక నాగశిరోమణు లీ స్థానమునఁ బడుచుండుట కలదు.

జీ.కే : దేవీ! సునందుఁడు చెప్పునది యుక్తముగనే యున్నది. అటులఁ గూడ కావచ్చును.

వృద్ధ : సునందా! పుత్రుఁ డిప్పటి కత్తవారియిల్లుఁ జేరియుండవచ్చును. శీఘ్ర ముగఁ బోయి చూచి రమ్ము.

ప్రతీ : అటులే చేసెదను. (నిష్క్రమించును.)

జీ.కే : దేవీ! ఇది నాగచూడామణియై యుండు నందువా? (రక్తవస్త్రాచ్ఛాదితుఁ డగు శంఖచూడుఁడు ప్రవేశించును.)

శంఖ : (కన్నీటితో) అకటా! దైవ మెంత మోసగించినది?

తే.గీ. పుణ్యగోకర్ణ సుక్షేత్రమున కెఱంగి
వేగ జేరితి నీ వధ్యనాగభూమి
నఖముఖావిద్ధవక్షు నీ యఖిలవంద్యుఁ
గొనియె గరుడుండు నాకాశమునకు నకట!

(ఏడ్చుచు) హా! మహాసత్త్వా! హా! పరమకారుణికోత్తమా! హా! నిష్కారణబాంధవా! హా! పరదుఃఖదర్శన దుఃఖితా! హా! విపద్వార్ధిపతిత జనోద్ధరణపోతా! హా! పరోపకారతృణీకృత దత్తదేహా! నీ వెచటికిఁ బోయితివి? నాకుఁ బ్రత్యుత్తర మిమ్ము. (తన్నుఁ జూచికొని) ఆహా! దురదృష్టవంతుఁడ నెంత మోసపోతిని? ఓరీ దురాత్మా! శంఖచూడా! నీ వెంత పనిఁజేసితివి? అయ్యయ్యో!

తే.గీ. అహుల రక్షించి సత్కీర్తి నందనైతి
స్వామి యాజ్ఞలఁ బాలింపఁ జాలనైతిఁ

బరుని దయచేతఁ గాపాడఁబడితి దీను
రీతి నక్కట నే మోసపోతిగాదె!

ఇట్లు అపహాసాస్పదుఁడనై క్షణమైన జీవింపఁజాలను. ఈ రక్తధార ననుసరించి పోయెదను (భూమివైపు జూచుచు నడచి)

ఉ. ఆదిన్ సంతతధారమై క్రమమునన్ బ్రాప్తోరుబిందుత్వమై
క్షోదంబొచు శిలాతలానఁ బడుటన్ క్షోణిన్ గృమివ్యాప్తమై
సాదృశ్యాస్ఫుట మౌచు ధాతుశిలలన్ శాఖాగ్ర సంలీనమై
భేదాసాదిత రక్త పంక్తిగతి నన్వేషింతుఁ దన్మార్గమున్.

వృద్ధ : (భయముతో) మహారాజా! ఈతఁ డెవ్వఁడో యేడ్చుచు నీవైపు వచ్చుచు నా హృదయముఁ బర్యాకులము జేయుచున్నాఁడు. ఈతఁ డెవ్వఁడో తెలిసికొనుఁడు.

జీ.కే : అటులే కావింతును.

శంఖ : హా! త్రిభువనైక చూడామణీ! హా! పరార్థపరిత్యక్తదేహా! నిన్నెచటఁ జూతును? అయ్యో! కోల్పోయితిని. కోల్పోయితిని. (ఏడ్చును.)

జీ.కే : (విని, సంతోషముతో) దేవీ! విచారింపకుము. ఈ చూడామణి యీతనిదై యుండును మాంసలోభమున నెద్దియో విహంగమముచే నపహృతమై కాలోలు నిచటఁ బడినది.

వృద్ధ : (సంతోషముతో మలయవతినిఁ గౌగలించుకొని) సౌభాగ్యశాలినీ! ధైర్యము వహింపుము. ఇట్టి యాకృతివిశేషము వైధవ్యదుఃఖభాజన మగునా?

మల : (సంతోషముతో) అమ్మా! ఇది మీ యాశీఃప్రభావము. (పాదములపైఁ బడును.)

జీ.కే : (శంఖచూడుని సమీపించి) వత్సా! నీ చూడామణి నెవ్వరైన నపహరించినారా?

శంఖ : ఆర్యా! నా చూడామణినే కాదు, త్రిభువన చూడామణినే యపహరించినారు.

జీ.కే.: అది యెట్లు?

శంఖ : దుఃఖాతివేగముచేఁ గంఠము బాష్పోపరుద్ధ మగుచున్నది. చెప్పఁజాలను.

జీ కే :

తే.గీ. తెలుపుమా పుత్ర దుఃఖంబుఁ దెలుపుమయ్య
నా మనంబున సంక్రమణంబుఁ జెంది
దుస్సహంబయ్యెఁ దావక దుఃఖ భార
మగును సుసహంబు నిశ్చయ మఱసి చూడ.

శంఖ : వినుడు, నేను శంఖచూడుఁ డను నాగుఁడను. వంతు ననుసరించి వాసుకి నన్ను వైనతేయున కాహారముగఁ బంపినాఁడు ఈ రక్తధార పరాగము లచే నాచ్ఛాదితమై దుర్లక్ష్యము గావచ్చును. కావున సూక్ష్మముగఁ దెల్పె దను.

తే.గీ. పరమ కారుణికుం డతిపావనుండు
ధార్మికోత్తముఁ డొక్క విద్యాధరుండు
తనదు దేహంబుఁ దృణ మటుల్ తార్క్ష్యన కిడి
నాదు ప్రాణాల రక్షించినాఁడు నేఁడు.

జీ.కే.: జీమూత వాహనుఁడు తక్క నిట్లు పరోపకార పరాయణుఁడు వేఱ యెవ్వడున్నాఁడు? వత్సా! "నీ కుమారుఁ డగు జీమూతవాహనునిచే" నని స్పష్టముగఁ జెప్ప వేమి? దురదృష్టవంతుఁడను; నశించితిని.

వృద్ధ : హా! పుత్రా! ఎంత పనిఁ జేసితివి?

మల : హా! దుశ్శకునము సత్యమే యైనదా? (ఎల్లరు మూర్ఛిల్లుదురు).

శంఖ: (కన్నీటితో) అరే! వీ రా మహాసత్త్వుని తలిదండ్రులై యుందురు. దుర్వార్తను దెలిపి వీరి నిటులఁజేసితినే! ఔను. విషధరుని ముఖమునుండి వేరొం డెట్లు వచ్చును? ఆహా! ప్రాణదాత యగు జీమూతవాహనునకు శంఖ చూడుఁ డెట్టి ప్రత్యుపకారముఁ జేసినాఁడు! ఇపు డేమి చేయుదును? ఆత్మహత్య జేసికొందునా? కానిమ్ము. వీరల నూరడింతును. తండ్రీ! యూరడిల్లుము. అమ్మా! యూరడిల్లుము. (ఇరువురు నూరడిల్లుదురు.)

వృద్ధ: (మలయవతితో) అమ్మా!లెమ్ము, ఏడ్వకుము. జీమూతవాహన విహీనులమై మనము మాత్ర మెట్లు జీవించి యుండఁగలము? ఊరడిల్లుము.

మల : (ఊరడిల్లి) హా! ఆర్యపుత్రా! ఇఁక నిన్ను నే నెక్కడ చూడవలయును?

జీ.కే.: హా! వత్సా! హా! గురు శుశ్రూషా ప్రవణా!

కం. నా చరణ ద్వంద్వంబున
నీ చూడామణిని విడచి నిర్మలమతి! నీ
యాచార వినయ సంపద
నాచరణంబుననుఁ జూపవా యంతమునన్?

(చూడామణినిఁ జేత గ్రహించి) హా! వత్సా! నీ దర్శన మింతమాత్రమే యైనదా? (ఎదపై నుంచుకొని) అయ్యయ్యో!

తే.గీ. భక్తినమ్రుఁడవై నీవు యుక్తరీతి
నాదు పాదమ్ములకు వందనమ్ము సేయ
నిత్య సంఘర్షణంబున స్నిగ్ధ మయ్యె
నీ శిరోమణి హృదయంబు నిర్మథించు.

వృద్ధ : హా పుత్రా! జీమూతవాహనా! గురుశుశ్రూష తక్క నితర సుఖముల నభిలషింపని నీ విపుడు దండ్రిని విడచి స్వర్గసౌఖ్య మనుభవింప నెటు లేగితివి?

జీ.కే.: (కన్నీటితో) దేవీ! జీమూతవాహనుని విడచి మనము మాత్రము జీవింప గలమా? ఏల యిట్లు పల్కెదవు?

మల : (పాదములపైఁ బడి దోసిలిఁ బట్టి) ఆర్యా! ఆర్యపుత్ర దేహాలంకార చిహ్న మగు నీ చూడారత్నము నా కిమ్ము. దీని వక్షమున ధరించి యగ్నిప్రవేశముచే నా హృదయసంతాపమునుఁ జల్లార్చుకొందును.

జీ.కే.: పతివ్రతారత్నమా! వేగిరపడెద వేల? మన యందర నిశ్చయము నిదే కదా?

వృద్ధ: మహారాజా! అటులైన నాలస్య మెందులకు?

జీ.కే.: దేవీ! యేమియును లేదు. కాని, యాహితాగ్ని యన్యాగ్నులచే నగ్ని సంస్కారము నందరాదు కదా! కావున, నగ్నిగృహము నుండి వహ్నిఁ గైకొని యగ్నిప్రవేశముఁ జేయుదము.

శంఖ : (తనలో) అకటా! పాపాత్ముఁడ నగు నా యొక్కనికొఱకు విద్యాధర కుటుంబ మంతయు నశించెను గదా! ఇట్లు చేసెదను. (ప్రకాశముగా) తండ్రీ! విషయము నిస్సందేహముగఁ దెలియక యిట్టి సాహసము జేయ

రాదు. విధివిలసితములు విచిత్రములు గదా? ఈతఁడు నాగుఁడు కాఁడని తెలిసి నాగారి ఆతని విడువవచ్చును. కావున, నీ రక్తధారచే వైన తేయు ననుసరింతము.

వృద్ధ : కుమారుని బ్రాణములతోఁ జూచునట్లు దేవత లనుగ్రహింతురు గాక!

మల : (తనలోఁ దన్ను నిర్దేశించి) ఈ దౌర్భాగ్యవతి కిది శక్యమగునా?

జీ.కే : వత్సా! నీ వాక్యము సత్య మగుగాక! ఐనను వహ్నితోడనే వాని ననుస రింతము. నీవా సంతతధార ననుసరింపుము. అగ్న్యగారము నుండి యగ్నిఁ బరిగ్రహించి మేమును వెనువెంటనే వచ్చుచున్నాము. (పత్నీ వధూసమేతుఁడై వెడలును.)

శంఖ : గరుత్మంతు ననుసరింతును. (నడచి యెదుటఁ జూచుచు)

చ. శిలలన్ రక్త విలిప్తచంచుకషముల్ చేయంగ ద్రోణ్యాకృతిన్
జ్వలదత్యుగ్రవిలోచనాగ్నులు దహింపన్ గాననాంతంబులన్
స్థలియున్ వజ్రకఠోర తీవ్ర నఖరాన్తక్రాన్తిచేఁ గ్రుంగ నీ
మలయాగ్రంబున బన్నగాశను డకంప్యప్రజ్ఞఁ గన్పట్టెడున్.

(ఉపవిష్టుడై గరుత్మంతుడును వాని యెదుటఁ బడియున్న నాయకుఁ డునుఁ బ్రవేశింతురు.)

గరు : (తనలో) పుట్టినది మొదలు భుజగపతుల భక్షించుచున్న నే నెన్నడు నిట్టి యాశ్చర్యముఁ జూడలేదు. ఈ మహాసత్త్వుఁడు వ్యథఁ జెందకుండుటయే గాక సంతుష్టాంతరంగుఁడు వలెఁ గూడ గన్పట్టుచున్నాడు. ఏలయన—

ఉ. గ్లాని యొకింత లే దవిరలం బగు రక్తము నెల్లఁద్రాగఁగా
నాననమున్ బ్రసన్నతర మామిషమంతయు ఛిన్నమై పడన్
గాననగున్ స్ఫుటంబు పులకంబు లఖండితగాత్రసీమన
మ్లానతఁ జూచు నన్నహితు మారకునిన్ హితకారునివ్వలెన్.

ఈతని యీ ధైర్యముఁ జూడ జాల కుతూహలము గల్గుచున్నది. కానిమ్ము; భక్షించుట మాని యీతఁ డెవ్వఁడో యడిగెదను. (భక్షణము మాని యెదుట నిలఁబడును)

జీ.వా :

తే.గీ. కారుచుండంగ శిరల రక్తంబు చాల
యామిషంబుండ నా దేహమందు నింకఁ
బూర్ణసంతృప్తినందక మున్నె యేల
నన్ను భక్షింపమానెదో నాగవైరి?

గరు : (తనలో) ఏమి యాశ్చర్యము? ఇట్టి యవస్థలోఁ గూడ నెంత యౌదార్యముఁ జూపుచున్నాఁడు! (ప్రకాశముగా) ఓ మహాసత్త్వా!

తే.గీ. గాఢచంచూపుట ప్రౌఢ ఘట్టనముల
నీదు హృద్రక్తమాత్రంబె నేనుఁ గొంటి
నీ యలౌకిక ధీరతోదీర్ణవృత్తి
నపహరింపవె నా హృదయంబె నీవు!
కావున నీవెవ్వఁడవో తెలుపఁ గోరుచున్నాను.

జీ.వా : నీవిట్లాకలిచే బాధపడుచుండఁ జెప్పుట యుక్తము గాదు. ముందుగా నా మాంసశోణితములతోఁ దృప్తితీర నారగింపుము.

శంఖ : (తొందరగా సమీపించి) వైనతేయా వైనతేయా! సాహసింపకుము సాహసింపకుము! ఈతఁడు నాగుఁడు కాడు. ఈతని విడచి నన్ను భక్షింపుము. నీ యాహారార్థమై వాసుకి పంపినవాఁడను నేనే (వస్త్రము నిచ్చును.)

జీ.వా : (శంఖచూడునిఁ జూచి, తనలో) శంఖచూడుఁడు మధ్యలో నా యభిలాషను విఫలముఁ జేయుచున్నాఁడే!

గరు : (ఇరువురనుఁజూచి) మీ యిరువురకును వధ్యచిహ్న మున్నది. మీలో నాగుఁ డెవ్వఁడో తెలియజాలకున్నాను.

శంఖ : నీ వనావశ్యకముగనే భ్రాంతిఁ జెందుచున్నావు.

చ. ఉరమున స్వస్తికాంకము నటుంగ నిమ్మిటఁ గూసమున్నదే
నరజని దుర్లభంబు రసనాద్వయిఁ జూడవె మాటలాడగన్
వర విష వహ్ని ధూపిత వివర్ణిత రత్న మరీచికాకులం
బరయవె నా ఫణాత్రయి నుదంచిత పూత్కృతిశోకదీనమున్.

గరు : (శంఖచూడుని పడగలనుఁ జూచి జీమూతవాహనునిఁ జూపుచు) మఱి నే భక్షించినవాఁ డెవ్వఁడు?

శంఖ : విద్యాధర వంశతిలకుఁ డగు జీమూతవాహనుఁడు. దయావిహీనుఁడవై యెంత పని చేసితివి?

గరు : (తనలో) ఏమీ! ఆ విద్యాధర కుమారుఁడగు జీమూతవాహనుఁ డీతఁడేనా?

చం. హిమగిరియందు మందరమహీధరసానుల మేరుభూములన్
విమల ధనాధినాథ నగవీథుల సహ్యమహేంద్రపర్వతాం
తముల దిగంత భూధరవనంబులఁ జారణు లెల్ల పాడ యీ
యమరగణేడ్యు దివ్యయశ మంతట విందును గాదె నిత్యమున్.

అక్కటా! మహాపాపమునఁ బడితిని.

జీ.వా: ఓయీ, నాగకులావతంసా! ఇట్లారాటపడెద వేల?

శంఖ : ఆరాటము గాక మఱి యేమి?

తే.గీ. ఈవు దేహంబుఁ దార్క్ష్యన కిచ్చి నాదు
పాడు దేహంబు దీనిఁ గాపాడినావు!
దారుణంబైన నిరయాన ఘోరరీతి
న్యాయమే నన్నుఁ బడఁ ద్రోయ నార్య! చెపుమ.

గరు : ఏమీ! కరుణార్ద్రచేతస్కుఁ డగు నీ మహాత్ముఁడు నా యాహారమగు నీ నాగుని రక్షింపఁ దన దేహమునే నా కాహారముగ నిచ్చినాఁడా? ఎంతటి మహా పాతకముఁ జేసితిని! వేయేల - బోధిసత్త్వునే చంపితిని. ఈ మహాపాపమున కగ్నిప్రవేశము దక్క వేరొండు ప్రాయశ్చిత్తము లేదు. అగ్ని నెచట సంపాదింతును? (ఎదుటఁ జూచి) అగ్నితో నెవ్వరో యిటులే వచ్చుచున్నారు. వారల కొఱకై నిరీక్షింతును.

శంఖ : కుమారా! నీ తల్లిదండ్రులు వచ్చుచున్నారు.

జీ.వా : (తొందరగా) నాయొద్దనే కూర్చుండి యుత్తరీయముతో నన్నాచ్ఛాదించి పట్టుకొనుము. లేనిచో నన్నీ యవస్థలోఁ జూచి తలిదండ్రులు జీవితమునే విడువవచ్చును. (శంఖచూడుఁడు ప్రక్కఁ బడి యున్న యుత్తరీయమునుఁ దీసి కప్పును.)

(అంత పత్నీ వధూసమేతుఁడై జీమూతకేతువు ప్రవేశించును.)

జీ. కే : (కన్నీటితో) హా పుత్రా! జీమూతవాహనా!

మ. తనవాఁ డీతఁ డితండు నన్యుఁ డను భేదంబుల్ దయన్ గానరా
వనఘా! యెననుఁ జూడవైతి వధికత్వాల్పత్వముల్ సంఖ్యలన్
గనవే! యొక్కని రక్ష కాత్మతనువున్ గల్పింపఁ దార్క్ష్యాశనం
బనవద్యాత్ముఁడ పీవు నీ జనక భార్యాదుల్ వగన్ గ్రుగ్గుటన్.

వృద్ధ : (మలయవతితో) పుత్రీ! క్షణకాల మూరడిల్లుము. నీ సంతతాశ్రుధారలచే
నగ్ని శాంతించుచున్నది ఏద్వకుము.

(అందఱు నడతురు.)

జీ. కే : హాపుత్రా! జీమూతవాహనా!

గరు : (విని) ఎవ్వఁడీతఁడు? "హా!పుత్రా! జీమూతవాహనా!" యనుచున్నాఁడు? నిశ్చయముగ నీతఁడు వీని తండ్రియె. ఈతని యగ్ని మనకు వలదు. వీని కుమారునిఁ జంపి యే మొగముతో వీనిఁ జూడ గలను? అదియునుఁ గాక అగ్ని నిమిత్తమై బాధపడ నేల? జలధితీరమున నుంటిని గదా? కావున నిపుడే—

శా. జ్వాలాభంగములన్ జగత్త్రియ జిఘత్సావ్యాత్త కాలానల
ప్రాలంబచ్ఛటులాగ్ర జిహ్వలవలెన్ వార్ధిశజగ్ధిక్షమున్
వ్యాలోలాహత పక్షవాత కలనాప్రాప్తోరు సంధుక్షణ
జ్వాలాభీకరు బాడబాగ్ని నిదె నేఁ బాపిన్ బ్రవేశించెదన్.

(లేవఁబోవును.)

జీ. వా : ఓ! విహగకులాధీశా! ఈ యధ్యవసాయము విడువుము. ఈ పాపమున కిది ప్రాయశ్చిత్తము గాదు.

గరు : (ముంగాళ్ళపైఁ గూర్చుండి కృతాంజలియై) మహాత్మా! అటులైన నా ప్రాయశ్చిత్త మెద్దియో చెప్పుము.

జీ వా : క్షణకాలము నిరీక్షింపుము. నా తలిదండ్రులు వచ్చుచున్నారు. వారి కభివాదనముఁ జేయవలయును.

గరు : అటులే చేయుము.

జీ. కే : (చూచి, సంతోషముతో) దేవీ! యదృష్టవంతురాలవు. కుమారుఁడు సజీవుఁడై యుండుటయే గాక గరుత్మంతుఁ డీతని యెదుటఁ గృతాంజలియై శిష్యుని వలె సేవించుచున్నాఁడు.

వృద్ధ : (సంతోషముతో) మహారాజా! కృతార్థురాలను. అక్షతగాత్రుఁ డగు కుమారుని ముఖమునుఁ జూతును.

మల : ఆర్యపుత్రునిఁ బ్రత్యక్షముగఁ జూచుచున్నను నా హృదయ మీ యత్యంత ప్రియవిషయము నమ్మఁజాలకున్నది.

జీ. కే : (సమీపించి) వత్సా! రమ్ము రమ్ము, నన్ను గౌగలించుకొనుము.
(జీమూతవాహనుఁడు లేవఁబోయి యుత్తరీయము జార మూర్ఛిల్లును.)

శంఖ : కుమారా! ఊరడిల్లు మూరడిల్లుము.

జీ కే : హా! వత్సా! నన్నుఁ జూచియు విడచిపోతివా?

వృద్ధ : హా! పుత్రా! వాచామాత్రముచేనైన గౌరవింపఁజాల వైతివి గదా!

మల : హా! ఆర్యపుత్రా! గురుజనమును గూడ నుపేక్షించితివా?

(అందఱును మూర్ఛ నొందుదురు.)

శంఖ : ఛీ! శంఖచూడ హతకుఁడా! పరప్రాణ రక్షిత జీవితా! గర్భముననుండగనే యేల నశింపకపోతివి? క్షణక్షణమునను మరణాధిక మగు దుఃఖము నొందకుందువు కదా?

గరు : ఇది యంతయుఁ గ్రూరాత్ముఁడ నగు నా యపరీక్ష్యకారిత్వపు ఫలితము. ఇటులఁ జేయుదును. (ఱెక్కలతో వీచుచు) మహాత్మా! ఊరడిల్లు మూరడిల్లును.

జీ. వా : (ఊరడిల్లి) శంఖచూడా! గురువుల నూరడిల్లఁ జేయుము.

శంఖ : తండ్రీ! యూరడిల్లుము. తల్లీ! యూరడిల్లుము. జీమూతవాహనుఁడు సేదతీరి మిమ్ముల నూరడించుటకై లేచినాడు, చూడుడు.

(ఇరువురు నూరడిల్లుదురు.)

వృద్ధ : పుత్రా! మేము చూచుచుండగానే యీ పాడుమృత్యువు నిన్నపహరించుచున్నదా?

జీ. కే : దేవీ! యిటు లమంగలముఁ బలుకకుము. చిరంజీవి జీవించియే యున్నాఁడు. కోడలి నూరడింపుము.

వృద్ధ : (వస్త్రముచే ముఖము నాచ్ఛాదించి యేడ్చుచు) అమంగలము ప్రతిహత మగు గాక! ఇఁక నేడువను. (మలయవతితో) పుత్రీ! ఊరడిల్లు మూర డిల్లుము. లెమ్ము, కొంత సేపైన నీ పతి ముఖమునుఁ జూడుము.

మల : (ఊరడిల్లి) హా! అర్యపుత్రా!

వృద్ధ : (మలయవతి ముఖమునుఁ జేతితోఁ దుడిచి) సౌభాగ్యవతివై వర్ధిల్లుము. అమంగళము ప్రతిహత మగు గాక!

జీ.కే : (కన్నీటితోఁ దనలో)

తే.గీ. కాయమంతయు ఖండిత ప్రాయమౌటఁ
ప్రాణముల్ జేరె కంఠ మాశ్రయము లేక
సుతునిఁ జూచియు నీ దశ నతుల దుఃఖ
విదలితంబికఁగాదు నా హృదయమౌర!

మల : ఆర్యపుత్రా! ఈ విధముగ నిన్నుఁ జూచియుఁ జీవించి యున్నాను; నేనెంత దుఃఖ భాగినో కదా!

వృద్ధ : (పుత్రుని యవయములనుఁ జేతితో నిమురుచు గరుత్మంతునితో) క్రూరాత్మా! అలంకారములకుఁ గూడ నలంకార మగు నా కుమారుని సుకుమార శరీరము నిటులఁ జేసితివా?

జీ వా : అమ్మా! అటు లనకుము. ఈ తఁ డేమి చేసెను? ఈ శరీరము పూర్వము మాత్ర మిటుల లేదా? చూడుము—

తే.గీ. విస్రమేదోస్థి మాంస మజ్జాస్ర సంఘ
మౌర చర్మావృతం బౌట నయ్యె గాయ
మటుల బీభత్స దర్శన మైన దీన
నెటుల కల్గునో సౌందర్య మీవ చెపుమ?

గరు : మహాత్మా! నారకాగ్ని జ్వాలా పరివృత దేహుఁడ వలె మహాదుఃఖ మను భవించుచున్నాను. ఈ పాపము తొలఁగు నుపాయము సెలవిమ్ము.

జీ.వా : తండ్రీ! ఈ పాపమునకుఁ బ్రాయశ్చిత్తము నువదేశింతును. అనుజ్ఞ నిమ్ము.

జీ.కే : వత్సా! అటులే చేయుము.

జీ.వా : వైనతేయా! వినుము.

గురు : (ముంగాళ్ళపై నిలచి, శిరమున నంజలి ఘటించి) ఆర్యా! ఆజ్ఞాపింపుము.

జీ.వా : వినుము.

ఉ. దారుణ హింస మాను మనుతాపముఁ జెందుము పూర్వ వృత్తికిన్
వారక పుణ్య కర్మ పరివాహముఁ బెంపు మభీతి నిమ్మికన్
భైరవ పాప మెల్ల పరిపాకము నందక దీన లీనమౌ
వారి సమాప్లుతహ్రద నిపాతిమౌ లవణాణువున్ వలెన్.

గురు : అటులే చేయుదును.

తే.గీ. దారుణాజ్ఞాన నిద్రలఁ దవిలి యుండ
నన్ను బోధించితివి నీవు నమ్యమూర్తి
ప్రతిన సేయుచునున్నాఁడఁ బ్రాణివధలఁ
గలలనైననుఁ జేయఁగఁ దలఁప నయ్య.

ఇటుపై—

మ. ఒకచో ద్వీపసమాన మౌచు విపులాత్యుచ్ఛ్రాయ భోగావళిన్
వికటావర్త విలాసమౌచు నొకటన్ విష్వగ్వలత్కాయత
ప్రకటం బొక్కట నౌచు సేతువు వలెన్ బారానకున్ బోవుచో
సకలాహిప్రజ మందుగాత నుదధిన్ సౌంఖ్యాంచిత క్రీడలన్.

మఱియు-

మ. పాదాంతశ్లథలంబ మౌచుఁ గబరీభారంబు శోభిల్లఁగా
నాదిత్యాంశులు సోకి గండము లసూర్యంపశ్యముల్ కంద నా
క్లేదం బెల్ల సహించి నాగయువతుల్ లీలన్ దగన్ త్వద్యశం
బాద్భృత్యంచిత గీతి రీతి నెపుడున్ సానందలై పాడుతన్.

జీ.వా : బాగుగనున్నది మహాత్మా, బాగుగ నున్నది. మే మనుమోదించితిమి. దృఢనిశ్చయుఁడవు కమ్ము. (శంఖచూడునితో) శంఖచూడా! నీవును గృహమునకుఁ బొమ్ము.

శంఖ : (నిట్టూర్చుచు) తల వంచి నిలబడును.)

జీ.వా : (శంఖచూడునిఁ జూచి) శంఖచూడా! శీఘ్రముగఁ బొమ్ము, శోకాకుల మానస యగు నీ తల్లి యొద్దకుఁ బొమ్ము.

తే.గీ. తార్క్ష్య చంచూపుటాహతి త్యాజితాసు
నిన్ను భావించి నిస్తుల స్నేహ వృత్తి
శోకసాగర మగ్న యస్తోక విగ్న
జననిఁ గావంగఁ బొమ్మిఁక జాగులేక.

వృద్ధ : (కన్నీటితో) వైనతేయముఖపతితుఁడై యక్షతగాత్రుఁ డగు కుమారునిఁ జూచుట కామె యెంత పుణ్యాత్మురాలో కదా!

శంఖ : తల్లీ! కుమారుఁడు స్వస్థతఁ జెందినచో నీ మాట నిజమే యగును.

జీ.వా : (వేదనతో) అయ్యో! పరోపకార కరణానందవశమున నింతవఱకు నజ్ఞాతమైనను నీ యరుంతుద మగు వేదన నన్నిపుడు బాధింపఁ బ్రారంభించినది. (మరణావస్థ నభినయించును.)

జీ.కే : (భయావేగములతో) వత్సా! అటులఁ జేయుచున్నావేమి?

వృద్ధ : అయ్యో! యిటు లనుచున్నాదేమి? (గుండెలు బాదికొనుచు) అయ్యో! రక్షింపుడు రక్షింపుడు. నా పుత్రుఁడు మరణించుచున్నాఁడు.

మల : హా! ఆర్యపుత్రా! నన్ను విడచిపోవుట న్యాయమా?

జీ.వా : (దోసిలిఁ బట్ట ప్రయత్నించుచు) శంఖచూడా! నా చేతులు దగ్గరగఁ జేర్చుము.

శంఖ : (అటులఁ జేయుచు) అకటా! జగమనాథమైపోవుచున్నది.

జీ.వా: (కొంచెము నేత్రములఁ దెఱచి తలిదండ్రులఁ జూచుచు) తల్లీ! తండ్రీ! యిదియే నా యంతిమ ప్రణామము. ఏలయన—

తే.గీ. గాత్ర జాలంబు చేతనాగ్లాని నందె
శ్రవణముల్ పీడె విస్పుట శ్రవణశక్తిఁ
జెన్ను తొలగంగ వ్రాలె నీ కన్నుదోయి
పీడు చున్నవి ప్రాణముల్ వివశు నన్ను.

ఇంక నీ మాటలేల? "నాదు దేహంబు విడనాడి నాగరక్ష" యనుచు బడిపోవును.

వృద్ధ : హా పుత్రా! హా వత్సా! హా గురుజనవత్సలా! యెచటకుఁ బోయితివి! ప్రతివచన మీయవా? హా లోచనానందసంధాయకా! హా! జీమూతవాహనా! నిన్ను మఱల నెచటఁ జూతును?

జీ.కే : హా పుత్రా! జీమూతవాహనా! హా నిఖిలజనవత్సలా! హా సర్వగుణసాగరా! ఎక్కడ నున్నావు? ప్రతివచన మిమ్ము.
(చేతులెత్తి) అయ్యయో! ఎంత కష్ట మెంత కష్టము!

ఎటకుం బోవునొ ధైర్య మింక వినయం బెవ్వారి సేవించునో!
ఇట నాధార మదెద్దిమో క్షమకుఁ దానేమౌనొ దాతృత్వమ
క్కట సత్యంబు హతంబు గాదె కృపయున్ గార్పణ్యముం జెందదే
యటవీతుల్యమె కాదె లోకము భవత్త్యక్తం బికన్ బుత్రకా!

మల : ఆహా ఆర్యపుత్రా! నన్ను విడచి పోవుచున్నావా? ఓసీ దయావిహీనా, మలయవతీ! వజ్రకఠోరహృదయవై ప్రాణనాథుని విడచియు నింకను జీవించి యుంటివా?

శంఖ : హా నిష్కారణోపకారపరా! ప్రాణప్రియు లగు వీరలను విడచి యెచటకుఁ బోవుచున్నావు? ఇదిగో శంఖచూడుడు నీ వెనువెంటనే వచ్చుచున్నాఁడు.

గరు : హా! ఎంత కష్టము! ఈ మహాత్ముఁడు పంచత్వ మందినాఁడు. ఇపు డేమి చేయుదును?

వృద్ధ : (కన్నీటితోఁ బైకిఁ జూచుచు) ఓ లోకపాలకులారా! అమృతము వర్షించి మీరైన నా పుత్రుని బ్రతికింపరా?

గరు : (సంతోషముతోఁ దనలో) ఆహా! అమృతము మాటఁ జెప్పి యీమె బాగుగ జ్ఞప్తికిఁ దెచ్చినది. నా యపకీర్తి పూర్తిగఁ దొలఁగిపోయినట్లే. దేవతాధీశునిఁ బ్రార్థించి యతఁడు కురిపించిన యమృతవర్షముచే జీమూతవాహనునే గాక యస్థిపంజరావశిష్టులగు నీ పూర్వభక్షితోరగముల గూడ జీవింపఁ జేయుదును. ప్రార్థించిన వాఁ డీయకున్నచో—

శా. పక్షాధూనన జాతవాతతతులన్ బాధించి పాథోనిధిన్
చక్షుర్వహ్నివిదాహ తీవ్రతఁ బడన్ జంద్రార్కతారల్ స్వచం
చుక్షేపంబున వజ్రదండగదలన్ జూర్ణించి వజ్రిన్ యమున్
యక్షాధీశుని గూల్తు తెచ్చి సుధ, యిందవ్వారి వర్షించెదన్.
ఇదే నేను పోయెదను. (సాటోపముగా నడచుచు నిష్క్రమించును.)

జీ.కే : వత్సా! శంఖచూడా! ఆలసించెదవేల? కాష్ఠములఁ జేర్చి నా కుమారునకుఁ జితాగ్నినిఁ బ్రజ్వలింపఁ జేయుము. వాని వెనుక మేమునుఁ బోయెదము.

వృద్ధ : వత్సా! శీఘ్రముగ సిద్ధము చేయుము. మేము దగ్గర లేకున్నచో నీ సోదరుఁడు దుఃఖించును.

శంఖ : (కన్నీటితో) మీ యాజ్ఞప్రకారమే చేసెదను. నేనును మీకంటె ముందుగనే వచ్చుచున్నాను. (లేచి చితి నేర్పరచి) తండ్రీ! చితి సన్నద్ధమైనది.

జీ.కే : ఎంత కష్ట మెంత కష్టము! వత్సా. జీమూతవాహనా!

శా. భ్రూమధ్యంబున నూర్ణ శీర్షమున నీ పుణ్యస్ఫుటోష్ణీషమున్
ధామాంచజ్జలజానుకారి నయన ద్వంద్వంబు వ్యూఢం బురం
బీ మత్స్య ధ్వజ చక్రలాంఛిత పదం బెల్లన్ వృథా యయ్యెనే
హా! మద్దుష్కృతి! సార్వభౌమపదమున్ బ్రాపింప కెట్లేగెదో.
దేవీ! ఇంకను నేడ్చెదవేమి? లెమ్ము, చితి నెక్కుదము.

(ఎల్లరును లేతురు)

మల : (దోసిలి యొగ్గి పైకి జూచుచు) భగవతీ గౌరీ! "విద్యాధర చక్రవర్తి నీ భర్త కాఁగలఁ"డని యానతిచ్చితివి కదా! మందభాగ్య నగు నా విషయమున నీ మాట కూడ నసత్య మైనదా ?

(అంత ససంభ్రమముగ భగవతి గౌరి ప్రవేశించును.)

గౌరి : మహారాజా! జీమూతకేతూ! సాహసము చేయవలదు.

జీ.కే : ఏమీ! అమోఘ దర్శన యగు భగవతి గౌరియా!

గౌరి : (మలయవతితో) పుత్రీ! నా వాక్య మెట్లు లసత్య మగును? (జీమూతవాహనునిపై కమండలూదకముఁ జల్లును.)

తే.గీ. లలిత దేహమునున్ గూడ బలి యొసంగి
పరుల రక్షించునట్టి యో పరమ పుణ్య!
సంతసం బందితిని నేఁడనంతరీతి
చిరతరం బిఁక నొందుము జీవితంబు.

(జీమూతవాహనుఁడు లేచును)

జీ. కే : (సంతోషముతో) దేవీ! యదృష్టవంతురాలవు. కుమారుఁడు జీవించినాఁడు.

వృద్ధ : భగవతి యగు గౌరి ప్రసాదముచేత.

జీ.వా : (గౌరీదేవినిఁ జూచి బద్ధాంజలియై) ఏమీ! అమోఘ దర్శన యగు భగవతియా?

కం. అభిలాషితాధికవరదన్
శుభదన్ భక్తార్తిహరణ చుంచుపదాబ్జన్
విభవాకర సుకటాక్ష
ప్రభ నిను నేఁగొల్తునమ్మ పావని గౌరీ!

(గౌరిపాదములపైఁ బడును.)

(అందరును పైకిఁ జూతురు.)

జీ. కే : అరే! ఏమిది! మేఘములు లేకుండఁగనే వర్షము కురియుచున్నదే! భగవతీ, యిది యేమి?

గౌరి : రాజర్షీ, జీమూతకేతూ! పశ్చాత్తాపతప్త హృదయుఁ డగు వైనతేయుఁడు జీమూతవాహనుని, అస్థి మాత్రావశిష్టులగు నురగపతులనుఁ బునరుజ్జీవింపఁ జేయ దేవలోకము నుండి యమృత వృష్టిఁ గురిపించుచున్నాఁడు. (వ్రేలితోఁ జూపుచు) ఇటు చూడుము.

చ. స్ఫుటరత్నాంశు విరాజమానతనులన్ బూర్ణత్వ మింపారగన్
జటులాగ్రాంచిత జిహ్వికాద్వయి సుధాస్వాదార్థమై చాపుచున్
బటువేగ ప్రసరంబులన్ గిరిఝరీ ప్రాంతంబులన్ బోలుచున్
కుటిలాంచద్గతిఁ జొచ్చుచున్న దుదధిన్ ఘోరాహిజాలం బిటన్.

(జీమూతవాహనునితో) వత్సా, జీమూతవాహనా! నీవు పునర్జీవితమునకే గాక మఱియొక వరమునకుఁ గూడ నర్హుఁడవు.

మ. చలహంసాహత హేమపంకజ రజః సంజాత పంకావిలం
బుల మన్మానస జాత వారితతులన్ బూరించి స్వేచ్ఛోద్భవో
జ్జ్వల రత్నస్థగితంబులౌ కలశముల్ భవ్యాభిషేకంబు నే
వెలయం జేసెదఁ జక్రవర్తివగుమీ విద్యాధర శ్రేణికిన్.

మఱియు—

ఉ. కాంచన రత్నచక్ర మల గంధ గజంబు చతుర్విశాలదం
తాంచిత మశ్వరత్న మసితాభల నింద్రమణీ సమప్రభా
ప్రాంచిత మెంచ నీ మలయవత్యభిధాన మమూల్యరత్నమున్
సంచిత శోభ నగ్రసరణం బిపు డొందెదు గాక శ్రీమతన్.

చూడుము - శారద చంద్రమండల ధవలము లగు వింజామరలఁ జేతఁ గైకొని శబల మణి మరీచులచే నింద్రధనుః కాంతిఁ గల్పింపుచు నీ మతంగహతక ప్రభృతులగు విద్యాధరపతు లెల్లరు భక్తినామిత పూర్వ కాయులై నీకుఁ బ్రణామము లాచరించుచున్నారు, చెప్పుము నీకిక నేమి ప్రియముఁ గూర్తును?

జీ.వా : భగవతీ! ఇంకనుఁ బ్రియ మేమున్నది?

శా. ధీరున్ గాచితి శంఖచూడు, విహగాధీశుం దహింసార్థి యా
హారీభూతము సర్పజాలము పునః ప్రాప్తాసువయ్యెన్ గురుల్
వీరల్ నన్ను సజీవుఁ గాంచి యగులన్ వీడంగలే దందిటిన్
గౌరీ! రాజ్యము నీ సమక్షమున నింకన్ వేరె నా కేటికిన్?

ఐనను ఇటు లనుగ్రహింపుము.

శా. కాలంబందు సువృష్టి నిచ్చుత ఘనౌఘం బాఁడ బర్హుల్ ప్రభా
శాలిన్ మేదిని నెల్లఁ గప్పుచు హరిత్సస్యోత్తరీయంబునన్
శీలం బొప్ప విశుద్ధకాయ సువచశ్చిత్తంబులన్ బుణ్యమున్
జాలన్ జేయుచు సౌఖ్యమందుతఁ బ్రజల్ సజ్ఞాతి మిత్రాదులై.

(అందఱును నిష్క్రమింతురు.)

 శుభం భూయాత్. శ్రీరామార్పణమస్తు.



